విస్‌డమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక

సంపాదక వర్గం

సంపాదకుడు:
లయన్ కె.వి. గోవిందరావు
బి ఎ ఎల్ ఎల్ బి

గౌరవ సహాయ సంపాదకులు:
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
ఎమ్ ఏ విద్వాన్
బి బాలకుమార్ ఎమ్ ఏ బి యల్

సభ్యులు
కె వి ఎస్ గోవిందరావు, బి ఎస్సి ఎల్ ఎల్ బి.
కె వి ఎస్ శరత్‌బాబు, బి ఏ బి కామ్
కె వి ఎస్ విజయ కుమార్
కె రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000 00 |
| జీవిత చందా | 200 00 |
| 3 సంవత్సరాలకు | 33 00 |
| సంవత్సర చందా | 12 00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 75 00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 40.00 |

చందాలు పంపవలసిన చిరునామా

విస్‌డమ్ పబ్లికేషన్స్,
9. దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు 600 004

# ఈ సంచికలో

మార్చి 1983



★

ముఖచిత్రం - కలర్ ట్రాన్స్‌పరెన్సీ :
శ్రీ ఎస్. పి. కుమార్, న్యూ ఢిల్లీ

★

తెలుగు 'విస్‌డమ్' కు ఇది రెండో సంవత్సరం

## ధ్యానం

### ఆధ్యాత్మిక మార్గంలో



జేమ్స్ ఎలెన్

మార్గంలో అడుగు పెట్టిన వారికి మొదట 'పరిత్యాగ' భూమి ఎదురవుతుంది. వెనుకటి కోరికలూ, ఆశయాలూ, ఉద్వేగాలూ అన్నిటినీ వరుసగా పరిత్యజించివేసే దశ అది. అయితే - త్వరలోనే అందమైన, సంతృప్తికరమైన నూతన రూపంలో అవి అన్నీ మళ్ళీ ప్రత్యక్షం అవుతాయి - వదల్లేక వదల్లేక పాత నగల్ని కంసాలి మూసలో పడవేస్తే అవి కరిగి, సరికొత్త నగలుగా తిరిగి మనకు లభ్యం అయినట్టు! పాత అలవాట్లూ, ఆలోచనలూ వదలడం మొదట కష్టం అనిపించినా, వాటి స్థానే తిరిగి లభించే కొత్త ఆలోచనలూ, శక్తులూ అపూర్వమైన ఆనందాన్ని కలిగిస్తాయి! ●

## సంపాదకుని పేజీ

### తెలివిని సక్రమంగా వాడుకోవాలి!



చాలా మంది తమ కున్న తెలివితేటల్ని పూర్తిగా వినియోగించుకోరు. అందరికీ తెలిసిన సంగతి - వాడకం లేకపోతే ఏ వస్తువైనా తుప్పుపట్టి పోతుంది. ఉన్న తెలివిని వాడుకోడం చేతకాక, తమకు తగినంతగా తెలివి తేటలు లేవే అని చాలా మంది వాపోతూ ఉంటారు.

---

### అమెరికాలో దంత వైద్యులు జాస్తి!

ప్రపంచంలో ఎక్కువ మంది దంత వైద్యులు ఉన్న దేశం అమెరికా (యు.ఎస్.ఏ.). అమెరికన్ దంత వైద్య సంఘంలో నమోదైన సభ్యుల సంఖ్య 1,36,000.

"పొరపాటును సమర్థించుకోడం కంటె సరిదిద్దుకోడానికి తక్కువ టైమ్ పడుతుంది." -లాంగ్ ఫెలో

పెంపుడు కుక్కకీ, సర్కస్‌లో చింపంజీకీ శిక్షణ ఇచ్చినంత బాగా మన మెదడుకి కూడా మనం శిక్షణ ఇవ్వవచ్చు. చెయ్యీ, కాలూ ఎలా మన చెప్పు చేతలలో ఉంటాయో అలా మెదడును కూడా మన అధీనంలో ఉండేట్టు చేసుకో వచ్చు. మెదడును సంపూర్ణంగా వినియోగించుకున్న మహనీయులు అద్భుత కృత్యాలు ఎలా సాధించిందీ చరిత్ర మనకు చెబుతూంది. ఉదాసీనతతో, అలసత్వంతో మెదడును సక్రమంగా ఉపయోగించుకోని వారు తమ జీవితాలను నిరర్థకం చేసుకుంటారు.

నిగూఢంగా మనలో ఎన్నో శక్తులూ, సమర్థతలూ నిక్షిప్తం అయి ఉన్నాయని మనం మరచిపో కూడదు. ఆలోచనలే జీవితాన్ని ముందుకు నడుపుతాయి. ప్రేమే మనిషికి ఆకర్షణ కలిగిస్తుంది. ఇవాళటి మన స్థితికి మన ఆలోచనలే హేతువు. రేపటి మన స్థితిని మన ఆలోచనలే నిర్ణయిస్తాయి. కావలసిం దల్లా స్తబ్ధతను విదిలించుకొని ముందుకు సాగడం. భయపడుతూ చేతులు ముడుచుకొని కూచునే వ్యక్తి జీవితంలో ఏ ఘన కార్యం సాధించ లేడు. ప్రమాదాలను లక్ష్యపెట్టకుండా కార్య రంగంలో కురికి శాయశక్తులా పని చెయ్యడం ప్రారంభిస్తే ఎన్నడూ ఊహించని ఘన కార్యాలు మనం సాధిస్తాం. ప్రవాహంలో పడి కొట్టుకు పోకుండా సాహసంగా ముందంజ వేస్తే మన జీవితానికి అర్థం ఏర్పడుతుంది.

ముఖ్యంగా-మన మీద మనకు నమ్మకం ఉండాలి. మన సమర్థత విషయంలో తగినంత పాళాలో గమక ఆత్మవిశ్వాసం ఉంచే జీవితంలో మనం తప్పక ముందడుగు వేయగలం: ఆత్మవిశ్వాసం వల్లే చేబట్టిన పని పూర్తి చెయ్యగల మనే ధైర్యం వస్తుంది. ఆత్మ విశ్వాసం అర్భకులను కూడా అమర వీరులను చేస్తుంది. ఆత్మ విశ్వాసం వల్లనే నూతన యంత్ర నిర్మాతలు (inventors) తాము కన్న కలలను నిజం చేసుకో గలిగారు.

'తెలివి'ని పోషించుకోడానికి అవసరమైన ఒక ప్రక్రియ పరిశీలన. పరిశీలన వల్ల శ్రద్ధగానూ, సూక్ష్మంగానూ వస్తు స్వరూపాన్ని గ్రహించడం సాధ్యం అవుతుంది. యాపిల్ పండు చెట్టు మీద నుంచి క్రింద పడడం ఎందరు చూడలేదు? ఐజాక్ న్యూటన్ ఒక్కడే దాన్ని చూసి భూమ్యాకర్షణ సిద్ధాంతం కనిపెట్టాడు. పరిశీలన వల్లనే - అలెగ్జాండర్ బెల్ టెలిఫోన్ కనిపెట్టాడు. ఆల్బర్ట్

## పెద్ద మొదళ్లు గల బావోబాబ్ చెట్లు



ఉష్ణ మండలంలో ఎక్కువగా కనిపించే బావోబాబ్ చెట్ల మొదళ్ళు మిక్కిలి పెద్దవి. వాటి వ్యాసం సుమారు 30 అ. ల దాకా ఉంటుంది.

"తన లోపం ఎరిగినవాడే పరిపూర్ణుడైన మానవుడు." —గాలిబ్

ఐన్‌స్టైన్ 'సాపేక్షతా సిద్ధాంతం' కనుగొన్నాడు. థామస్ ఆల్వా ఎడిసన్ ఎలక్ట్రిక్ బల్బ్ రూపొందించాడు.

ఎవరికి వారు స్వతంత్రంగా ఆలోచించాలి. రబ్బరు స్టాంపు లాగ ప్రతిచోటా ఒకే ముద్ర వేస్తూ ఉండకూడదు. కళ్ళతో చూసిందీ, చెవులతో విన్నదీ, పుస్తకాలలో చదివిందీ మననం చేసి, మనదిగా చేసుకోకపోతే మన 'తెలివి'ని మనం సక్రమంగా ఉపయోగించుకున్నట్టు కాదు. గ్రహించిన అంశాల మంచి, చెడ్డలను సునిశితంగా పరీక్షించినప్పుడే మనకు సత్యం బోధపడడం, దానిని ఇతరులకు ప్రకటించగలగడం సాధ్యం అవుతుంది.

మెదడు ఒక కంప్యూటర్ లాంటిది; మనస్సు దానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తుంది: ఆలోచన ఆ కంప్యూటర్‌కి ప్రోగ్రాములు అందజెయ్యాలి. సామర్థ్యాన్ని తగినంతగా ఉపయోగించుకోకపోతే అది ఆత్మహాని కలిగిస్తుంది. ఎవరో దేవతలు ఆకాశం నుంచి దిగి వచ్చి అన్నీ మనకు అమర్చిపెడతారని ఎదురు తెన్నులు చూడడం వల్ల ప్రయోజనం శూన్యం. మన సంగతి మనమే చూసుకోవాలి. నిలువ నీరు చలిగాలికి గడ్డకట్టిపోతుంది. అలాగే సోమరితనం మనస్సును నిర్జీవం చేస్తుంది. అప్రమత్తులంగా ఉంటూ, అవకాశం చేజిక్కిన వెంటనే పైకి ఎగరడానికి నిరంతరం మనం సిద్ధంగా ఉండాలి. జీవితంలో విజయం సాధించేందుకు కీలకం ఇదే!

## Statement about ownership and other particulars about newspaper "Wisdom", Madras-1.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of publication | | **Madras** |
| 2. Periodicity of publication | | **Monthly** |
| 3 Printer's Name | | **D. Sridhara Rao** |
| Nationality | | **Indian** |
| Address | | **Kranti Press, 2, Francis Joseph Street, Madras - 600 001.** |
| 4. Editor's & Publisher's Name | : | **K.V. Govinda Rao** |
| Nationality | : | **Indian** |
| Address | : | **9, Desika Road, Mylapore, Madras-600 004.** |
| 5. Name and address of individuals who own the newspaper and partners | : | **Wisdom Publications, 9, Desika Road, Mylapore, Madras-600 004.** |

I, **K. V. Govinda Rao**, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd) **K.V. Govinda Rao,**
Editor & Publisher,

Dated : 1—3—83
Madras - 600 004.

తెలివైన తండ్రి కన్న కొడుకును గుర్తిస్తాడు! —షేక్స్‌పియర్

# నవభారత నిర్మాతలు

## ఆధునిక భారత యోగి
# ఆచార్య వినోబా భావే

డా. వెంపటి సూర్యనారాయణ

[ప్రస్తుతం హైదరాబాదులో 'కృష్ణా కళ్ళ ఆసుపత్రి' నిర్వహిస్తున్న సుప్రసిద్ధ నేత్ర వైద్యులు డా. వెంపటి సూర్యనారాయణగారు ఆచార్య వినోబా భావే సన్నిహిత సహచరులలో ఒకరు. 1936 ఫిబ్రవరి 25న మొట్ట మొదటి సారిగా వార్ధా సమీపాన ఉన్న గోపురిలో ఆయన వినోబా భావేను కలుసుకున్నది మొదలు ఆయన సలహా మీద తన సర్వ శక్తులూ వినియోగించి వేలాది నేత్ర రోగులకు ఆయన శస్త్ర చికిత్స చేస్తున్నారు. వినోబా బోధించిన 'సామ్య యోగదీక్ష'ను పాటిస్తూ, కలవారూ, లేని వారూ అనే తేడా లేకుండా అందరికీ సమానంగా ఆయన సేవ చేస్తున్నారు. మొదట మరాఠీలో ప్రకటితమైన వినోబా భావే 'గీతా ప్రవచనము'ను డాక్టరు గారు తెలుగులో అనువాదం చేశారు. ఆ తెలుగు అనువాదం ఇప్పటికి 80,000 కాపీలు ఖర్చు అయింది.]



వినోబా భావే

1982 నవంబరు 16వ తేదీన గాంధీ మహాత్ముని ఆధ్యాత్మిక వారసుడు ఆచార్య వినోబా భావే భౌతిక కాయానికి పౌనార్ ఆశ్రమంలోని 'ధామ్' నదీ తీరాన జరిగిన అంత్యక్రియలలో లక్షలాది జనం పాల్గొని అశ్రుపూర్ణ నయనాలతో ఆచార్యునికి అంతిమ వీడ్కోలు ఇచ్చారు. ఆహారం, ఔషధాలు, మంచినీళ్ళు తీసుకోడం మానివేసిన సుమారు 155 గం.లకు వినోభా భావే అంతిమ శ్వాస విడిచారు. ఈ విధంగా 'ప్రాయోపవేశం' చేసి స్వచ్ఛందంగా దేహ

త్యాగం చేయడం ఆధునిక మానవ చరిత్రలో ఒక అత్యద్భుతమైన సంఘటన.

ప్రస్తుతం మహారాష్ట్రకు చెందిన కులాబా జిల్లా 'గగోదే' గ్రామంలో 1895 సెప్టెంబరు 11 వ తేదీన ఒక బ్రాహ్మణ కుటుంబంలో వినోబా జన్మించారు. ఆయన తండ్రి నరహరి శంభూరావు భావే బరోడా సంస్థానంలో బట్టల మిల్లులో సాంకేతిక నిపుణులు. తల్లి రుక్మిణీదేవి గొప్ప భక్తురాలు. ఆమె నుంచే వినోబాకు భక్తిభావం, ఆత్మనిగ్రహం అల వడ్డాయి. పదో ఏటనే వినోబా బ్రహ్మచర్య దీక్ష స్వీకరించాడు.

చిత్రంగా - వినోబా సోదరులు బల్కోబాజీ, శివాజీ మహరాజ్ కూడా ఆధ్యాత్మిక చింతన గలవారు; బ్రహ్మచారులు. తండ్రి మరణానంతరం రూ. 25,000 ల రొక్కం, 25 ఎకరాల సుక్షేత్రమైన భూమి ధర్మ కార్యాలకు ఆ సోదరులు దానం చేసి వేశారు.

బరోడాలో ఇంటర్మీడియేట్ చదువుతూ ఉండగా వినోబాకు ఆ చదువు పొట్టకూటికి ఉపయోగపడేదే గాని, నిజమైన విజ్ఞానాన్ని కలిగించేది కాదు అని అర్థం అయింది. వెంటనే తన 17 వ ఏట స్కూల్ సర్టిఫికెట్లన్నీ తగుల బెట్టి, ఆయన కాశీ వెళ్ళి పోయారు. మొట్టమొదటిసారి గాంధీజీని 1916 లో ఆయన కలుసుకున్నారు. తత్ క్షణమే గుజరాత్‌లోని ఆయన సబర్మతీ ఆశ్రమంలో చేరారు.

గాంధీజీ సొంత కొడుకులాగ ఆయనను చూసుకునే వారు. 1921 లో వార్ధా సమీపంలో నూతన ఆశ్రమం నిర్మించడానికి గాంధీజీ ఆయన్నే పంపారు. ఆశ్రమంలో పాకీపని మొదలు వంటపని దాకా అన్ని రకాల పనులూ ఆయన చేసేవారు. ఎక్కువ కాలం నూలు వడకడంలో గడిపేవారు. ఆ విద్యలో ఆయన అందెవేసిన చేయి. మన పల్లెలలో అందరూ నూలు వడకడం వల్లే దారిద్ర్యాన్ని పార ద్రోలడం, గ్రామీణులలో నూతన చైతన్యం కలిగించడం సాధ్యం అవుతుం దని ఆయన దృఢంగా నమ్మేవారు.

---

## మాట్లాడే గడియారం




మ్యూనిచ్ (పశ్చిమ జర్మనీ) లోని ఎం. బి. ఓ. సంస్థ మొట్ట మొదటిసారిగా ఒక మాట్లాడే చేతి గడియారం కనిపెట్టింది. ఒక టైమ్‌కి అలారమ్ పెడితే, సరిగ్గా ఆ సమయానికి జర్మన్ భాషలో అది ఇంత టైమ్ అయింది అని చెప్పి, 5 నిమిషాలపాటు ఏదో ఒక ట్యూన్ వినిపించి, మళ్ళీ 'లే! లే! త్వరగా!' అని హెచ్చరిస్తుంది.

"జీవితం ఆలోచించేవారికి ఆనందమయం;
అనుభవించేవారికి విషాద భరితం!" —లీ బ్రూయర్

1923, 1932 సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని వినోబా జైలుకి వెళ్ళారు. జైలు నుంచి బయటికి రాగానే గ్రామీణాభివృద్ధి కార్యక్రమం చేపట్టేవారు. 1937 లో పౌనార్‌లో ఒక చిన్న గుట్టమీద ఆయన సొంత ఆశ్రమం స్థాపించుకోడానికి గాంధీజీ సమ్మతించారు. 1940 లో బ్రిటిష్ వారి నిరంకుశ శాసనాలకు నిరసనగా జరిగిన వ్యక్తి సత్యాగ్రహోద్యమంలో ప్రప్రథమ సత్యాగ్రహిగా గాంధీజీ వినోబాను ఎన్నుకున్నారు.

1942 లో గాంధీజీ ప్రారంభించిన 'క్విట్ ఇండియా' ఉద్యమంలో కూడా పాల్గొని వినోబా 3 ఏళ్ళు జైలు శిక్ష అనుభవించారు. 1947 లో భారత దేశ విభజన జరిగినప్పుడు తీవ్రమైన కాందిశీకుల సమస్యను దేశం ఎదుర్కోవలసి వచ్చింది. అప్పుడు కాందిశీకులకు సేవ చేయడం కోసం వినోబా తన మకాం ఢిల్లీకి మార్చారు. 1948 లో గాంధీజీ నిర్యాణానంతరం గ్రామీణ ప్రజల ఆర్థిక, ఆధ్యాత్మికాభివృద్ధి కోసం వినోబా నిరంతరం కృషి చేయసాగారు. గాంధీ వారసుని పదవిని నిరాకరించి 5 ఎకరాల స్థలంలో స్థిరపడి, స్వయం సంపూర్ణత కోసం ఆయన ప్రయత్నించారు. అదే గ్రామీణుల దారిద్ర్య సమస్యకు సరియైన పరిష్కార మార్గం అని ఆయన విశ్వాసం.

1951 ఏప్రిల్ నెలలో హైదరాబాద్‌లో ఒక అఖిల భారత సర్వోదయ సభ జరిగింది. అప్పుడు వినోబా వయస్సు 57 ఏళ్ళు; ఆయనకు చాలా సుస్తీ చేసింది. అయినా అడవుల గుండా, గ్రామాల గుండా సుమారు 300 మైళ్ళ దూరం కాలి నడకను ప్రయాణించి ఆయన హైదరాబాద్ చేరుకున్నారు. ఆ సభ అనంతరం దౌర్జన్యవాదులు భూస్వాములను దారుణంగా పట్టిపెడుతున్న తెలంగాణా జిల్లాలలో వినోబా పర్యటించారు. 1951 ఏప్రిల్ 18 వ తేదీన పోచంపల్లి అనే గ్రామాన్ని ఆయన చేరుకున్నారు సెంటు పొలం లేకుండా నిరాధారంగా ఉన్న హరిజనుల దుస్థితిని గురించి అక్కడ భూస్వాములతో ఆయన చర్చించారు. ఆయన మాటలకు గుండె కరిగి వి. రామచంద్రా రెడ్డి అనే భూస్వామి తనంతట తను 100 ఎకరాల భూమిని వినోబాకు దానం చేసి, భూములు లేని హరిజనులకు

## చేపల రెక్కల ఎగుమతి



ఒక షార్క్ చేప సుమారు 35 కి.గ్రా.ల బరు వుంటే, దాని రెక్కలు సుమారు 1 కి.గ్రాము తూగుతాయి. ప్రపంచ విపణిలో ఒక కిలో చేప రెక్కలు (fins) 50 డాలర్లకు కొంటున్నారు. 1980-81 లో 188 టన్నుల షార్క్ చేప రెక్కలు ఎగుమతి చేసి ఇండియా రూ. 1.76 కోట్ల విదేశీ మారక ద్రవ్యం ఆర్జించింది. ('హర్యానా రివ్యూ' నుంచి)

"రహస్యాన్ని నీలో ఉంచుకున్నంత వరకూ అది నీ అధీనంలో ఉంటుంది; బయట పెడితే దాని అధీనంలోనే నీవు ఉండాలి!" —ఎమర్సన్

దానిని పంచమని కోరారు. ఆ దానం వినో బాకు అమితానందాన్ని కలిగించింది. ప్రపంచ ఖ్యాతి పొందిన వినోబా భూదాన యజ్ఞానికి ఆ విధంగా ఆ నాడు అంకురార్పణ జరిగింది.

ఆ తరువాత 20 ఏళ్ళ పాటు 64,000 కి.మీ.ల దూరం పాదయాత్ర చేస్తూ ఇండి యాలో అన్ని రాష్ట్రాలలోనూ పర్యటించి వినోబా ఒక కోటి ఎకరాల పైచిలుకు భూమిని దానంగా స్వీకరించి, నిరుపేద గ్రామీణులకు దానిని పంపకం చేశారు. భూ దానోద్యమం తరువాత, గ్రామ దాన్, సంపత్తి దాన్, ఉపవాస దాన్, శ్రమ దాన్, బుద్ధి దాన్ ఉద్యమాలను కూడా వినోబా చేపట్టారు. వెళ్ళిన ప్రతి చోటా ప్రజలతో వారికి అర్థమయ్యే సరళమైన భాషలో ఆయన ప్రసంగించే వారు. గ్రామాల సౌభాగ్యాన్ని ఎలా పెంపొందించుకోవాలో వివరించేవారు. ఆ తరువాత సంపన్నులైనవారి నుంచి భూదానం అర్థించేవారు. తరువాతి కాలంలో భూదానోద్యమం ఎలా పరిణమించినా, దాని ద్వారా మనుష్యుల మంచితనంలో నమ్మకం, తమంతట తామే ప్రజలు తమ ఆస్తులు దానం చెయ్యగల రన్న విశ్వాసం సంఘ సముద్ధరణ కార్యక్రమంలో మొట్టమొదటి మెట్టు అనే సందేశాన్ని ఆయన ప్రపంచానికి అంద జేశారు.

వినోబా గొప్ప విద్వాంసులు. ఆయన 34 గ్రంథాలు వ్రాశారు. మహారాష్ట్ర భాషలో ఆయన రాసిన 'గీతై' 46 ముద్రణలు పొంది, 6.75 లక్షల ప్రతులు ఖర్చయింది. వినోబా 'గీతై' లేని మరాఠీ గృహం కనిపించదు. 1932 లో దూలియా జైలులో ఉన్న సమ యంలో తోటి రాజకీయ ఖైదీలకు వారం వారం గీతను గురించి ఆయన ఉపన్యసించే వారు. మరాఠీ భాషలో చేసిన ఆ ఉపన్యాసా లను సానే గురూజీ అనే ఆయన వ్రాసి 'గీతా ప్రవచనము' అనే పేరుతో అచ్చు వేయించారు. ఆ తరువాత అది అన్ని ప్రధాన ఇండియన్ భాషలలోకీ అనువాదం పొందింది.

తన జీవితాన్ని పూర్తిగా తన దేశం కోసం, మానవ జాతి కల్యాణం కోసం అంకితం చేసిన మహాయోగి వినోబా. ఆయన ఇచ్చిన సుప్రసిద్ధ నినాదం—'జై జగత్!' ●

---

## మీ రైతే?

(జనవరి 1983)

"చాలా మంచి వార్త చెప్పారు సార్!
ఈ మధ్య అప్పులవాళ్ళ గొడవ
మరీ ఎక్కువై పోయింది!"

—పి. జయప్రకాశ్,
కామారెడ్డి, (నిజామాబాద్ జిల్లా).

* * *

"విస్డమ్‌కు శాశ్వత చందా కట్టే
ఆలోచన మానుకుంటా!"

—పి ఆర్. కంకిపాటి, చీరాల.

* * *

"శుభమా అంటూ ఈ నూతన
సంవత్సరారంభంలో
ఇలాంటి ప్రశ్నలు అడిగి భయపెట్ట
కండి సార్! మమ్మల్ని!"

—యస్. వెంకటేశ్వర్లు,
గుడ్లూరు (ప్రకాశం జిల్లా).

---

"రాజీపడే స్వభావం గలవారు విప్లవాన్ని సాధించ లేరు."—కెమల్ అటా టర్క్.

# సంత్ నామదేవ్

బి. వి. శ్రీనివాసాచార్యులు

ఐహికమైన భోగ భాగ్యాల పట్ల అనాసక్తి, అహంకార, మమకారాలు వదలి తమను తాము భగవత్ కైంకర్యానికి అర్పించు కోడం ప్రాచీన భక్తులలో ప్రముఖంగా కని పిస్తాయి. అలా భగవద్దర్శనం కోసం అరాట పడిన ఒక ముగ్ధ భక్తుడు సంత్ నామదేవ్.

నక్కుబాయి కథ వల్ల తెలుగువారికి సుపరి చితుడైన పండరిపురం పాండురంగని భక్తుల పరంపరలో నామదేవ్ ముఖ్యుడు. 'మహా భక్త విజయం'లో కని పించే కథల ప్రకారం కబీర్. జ్ఞానేశ్వర్, తులసీదాస్, నరిసీ మెహతా, నానక్ మొదలైన సుప్రసిద్ధ ఉత్తర హిందూదేశ భక్తు లెందరో నామ దేవ్‌కి సమకాలికులు. మహారాష్ట్రి భాషలో నామదేవ్ పాడిన 2,500 పైచిలుకు అభం గాలు ఈ నాటికీ ఆ రాష్ట్రంలో ప్రజలు విరి విగా పాడుకుంటున్నారు.



విరల్ భక్తుడు : నామదేవ్

1270 లో ఒక శుక్లపక్ష ఏకాదశి ఆది వారంనాడు నరసింగ్‌పూర్‌కు చెందిన దామ సెట్టి అనే ఒక దర్జీవానికీ, ఆయన భార్య గుణాబాయ్‌కీ కుమారుడుగా నామదేవ్ జన్మిం చాడు. చిన్నతనంలో చదువును నిర్లక్ష్యం చేసి ఎక్కువ కాలం ఆడుతూ, పాడుతూ విఠలనాథుని ఆలయంలోనే ఆయన గడిపే వాడు.

ఒకరోజు తండ్రికి బదులుగా ఆలయానికి నైవేద్యం తీసుకు వెళ్ళిన నామదేవ్ అమా యిక భక్తికి పర వశుడై పాండురంగడు స్వయంగా మానవ రూపంలో వచ్చి అతడు పెట్టిన నైవేద్యం ఆర గించాడు. ఆ నాటి నుంచీ నామదేవ్‌కి లోకంలో పాందు

## చైనా భాషలో టైప్ రైటర్

చైనా భాష టైప్‌రైటర్‌లో 7,000 'కీ'లు ఉంటాయి. దానికి 'కీ బోర్డు' 1/2 మీటరు వెడల్పు ఉంటుంది. దాని మీద మిక్కిలి వేగంగా టైప్ చెయ్యగల వ్యక్తి కూడా నిమిషానికి 11 మాటలకంటె ఎక్కువ కొట్టలేడు.

"నిజాయితీ, సమర్థత, స్వార్థత్యాగం
లోపించిన వ్యవస్థలు అంతరిస్తాయి." —మహాత్మా గాంధీ

రంగడే సర్వస్వం అయాడు.

వివాహం చేస్తే అయినా నామదేవ్ దృష్టి లౌకిక విషయాల మీదకు మళ్ళుతుందేమో అని తల్లిదండ్రులు 'రాజాబాయ్' అనే కన్యను అతనికి వివాహం చేశారు. అయినా పాండురంగని మీది అతని వ్యామోహం రవ్వంత కూడా తగ్గలేదు.

పాండురంగడు నామదేవ్‌కి పిలిస్తే పలికే వాడని ప్రసిద్ధి. తనకు కొడుకు పుట్టినప్పుడు బారసాలకు అతని ఆహ్వానం మన్నించి మానవరూపంలో అతని ఇంటికి వెళ్ళి శిశువుకి 'నారాయణ' అని పేరు పెట్టమని పాండు రంగడే సూచించాడట!

మరో సారి - నామదేవ్ తల్లిదండ్రులు తమ ఒక్కగా నొక్క కొడుకుని తమకు కాకుండా చేస్తున్నాడని, వార్ధక్యంలో కొడుకు కాకపోతే తమ కెవరు ఆసరా అవుతా రని పాండురంగణ్ణి నిందించారు. అప్పుడు పాండు రంగడు వైకుంఠపురం వర్తకుడి వేషంలో వాళ్ళ ఇంటికి వచ్చి, తమ నామదేవ్ మిత్రుణ్ణని పరిచయం చేసుకొని, విలువైన కానుక లెన్నో వారికి ఇచ్చి అంతర్థానం అయాడు. అయితే నామదేవ్ ఇంటికి తిరిగి వచ్చి, తనకు అలాంటి మిత్రు దెవరూ లేడంటూ ఆయన ఇచ్చిన భోగ భాగ్యా లన్నీ పేద సాదలకు పంచిపెట్టాడు.

పండరిపురం ఆలయంలో తప్ప వేరె క్కడా తనను దర్శించలేని నామదేవ్ సంకుచిత దృష్టి పోగొట్టా లని పాండురంగడు అనుకున్నాడు. తన మరొక మహాభక్తుడు జ్ఞానదేవ్ చేత 'ఎవరైనా గురువు దగ్గర శుశ్రూష చెయ్య' మని నామదేవ్‌కి చెప్పించాడు. జ్ఞానదేవ్ సలహా మీద సంత్ విసోబా ఖేచరుని గురువుగా ఎంచుకొని ఆయన ద్వారా నామదేవ్ 'దేవుడు సర్వాంతర్యామి' అనే జ్ఞానం పొందాడు.

## టెంపరేచర్ చెప్పే ఉంగరం



బెన్సాలెమ్ (పెన్సిల్వేనియా - ఉ. అమెరికా) కు చెందిన ఒక సైకో - తెరపిస్టు రాబర్ట్ కాల్ వేలికి పెట్టుకుంటే టెంపరేచర్ ఎంతో చెప్పే 'జ్వరం - ఉంగరం' ఒకటి తయారు చేశారు. టెంపరేచర్ ¼ డిగ్రీ ఫారన్ హీట్ పెరిగినా ఈ ఉంగరంమీది రయల్ లో కనిపిస్తుంది. 25 డాలర్లు (సుమారు రూ. 225 లు) ఖరీదు చేసే ఈ ఉంగరం క్రీడాకారులకూ, 'మైగ్రేన్' అనే తలనొప్పి వంటి వ్యాధులతో బాధపడే రోగులకూ చాలా ఉపయోగం!

"శక్తిమంతమైన వ్యవస్థను బయటి వ్యతిరేకత ఏమీ చేయలేదు:
లోపలి కుళ్ళే దాన్ని హతమారుస్తుంది." —మహాత్మా గాంధీ

జ్ఞానదేవ్, నామదేవ్‌ల స్నేహం ప్రగాఢమైంది. వాళ్ళిద్దరూ కలిసి 5 ఏళ్ళ పాటు భారతదేశంలోని తీర్థయాత్ర లన్నీ తిరిగి వచ్చారు. ఉత్తరాన బదరీనాథ్, కేదారనాథ్ మొదలుకొని, దక్షిణాన రామేశ్వరం, కన్యాకుమారి దాకా వెళ్ళారు. వెళ్ళిన ప్రతి చోటా జనం తండోపతండాలుగా ఎదురు వచ్చి వారికి స్వాగతం చెప్పారు. భక్తిరసామృతాన్ని జనసామాన్యానికి రెండు చేతులతో వారు పంచిపెట్టారు.

తీర్థయాత్రలు తిరిగే సందర్భంలో ఎన్నో మహిమలు ఆయన ప్రదర్శించినట్టు 'నామదేవ్' జీవిత కథలు చెబుతున్నాయి. రాజస్థాన్‌లో ఒక ఎడారిగుండా పోతూ ఉండగా దప్పికతో బాధ పడుతున్న వారికి ఒక పాడుపడిన బావి కనిపించింది. అడుగున ఎక్కడో కొద్దిగా నీళ్ళు ఉన్నాయి. జ్ఞానదేవ్ తనకు గల 'లఘిమ' అనే విద్య సాయంతో పక్షిగా మారి తన ముక్కుతో నీరు పైకి తెస్తానన్నాడు. కాని నామదేవ్ కళ్ళు మూసుకొని రుక్మిణీదేవిని ప్రార్థించాడు. చిత్రంగా క్షణంలో పొంగులువారుతూ నీళ్ళు పైపైకి వచ్చి వారి దప్పిక తీర్చాయి. నేటికీ 'బికనీర్'కి సుమారు 10 మైళ్ళ దూరంలో ఉన్న కొలాడ్జి గ్రామంలో ఆ బావి ఉంది. వేలాది భక్తులు ఏటేటా వెళ్ళి అక్కడ స్నానాలు చేసి వస్తున్నారు.

దక్షిణదేశ యాత్ర చేస్తూ ఉండగా నాగనాథ పురంలోని శైవాలయంలో పూజారులు తమ దారికి అడ్డుగా ఉన్నా రని విసుక్కొని ఆలయం వెనుక భాగానికి పోయి వారిని

# శక్తి వంచన లేకుండా పని చెయ్యి!



"చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి. మనలో ప్రతి ఒక్కరం ఏదో ఒక పనినే ఎంచుకుని ఎన్ని కష్టాలు ఎదురైనా దానినే అంటి పెట్టుకొని ఉండాలి. 'ఇంత పెద్ద పని నేను చెయ్యగలనా!' అనుకోకూడదు. దానిలో నువ్వెంత చేయగలిగితే అంతే చెయ్యి!

చేసే పని ఎంత చిన్నదైనా ఫరవా లేదు. నీ సర్వ శక్తులూ ఉపయోగించి ఆ పని చెయ్యి! చాలా గొప్ప పని అని నువ్వు భావించే దాని విషయంలో ఎంత శ్రద్ధ, ఆసక్తి చూపిస్తావో అంత శ్రద్ధాసక్తులతోనూ ఆ పని చెయ్యి! అలా నువ్వు చేసే చిన్న విషయాలను బట్టే నీ విలువ నిర్ణయం అవుతుంది." —మహాత్మా గాంధీ

"జీవితంలో ఒక లక్ష్యం ఏర్పరచుకోవాలి; తరువాత ఆ లక్ష్యం కోసం సర్వశక్తినీ వినియోగించి కృషి చెయ్యాలి!" —కార్లైల్

వంకీ ర్తన చేసుకో మన్నారట। చిత్రంగా మర్నాడు ఉదయం పూజారులు వచ్చి చూస్తే తూర్పు ముఖంగా ఉన్న దేవుడూ, ఆలయం పడమటి ముఖంగా తిరిగి ఉన్నాయట। ఈ నాటికీ అక్కడి ఆలయం పడమటి ముఖం గానే ఉంది.

నామదేవ్ గురు నానక్‌ని కలుసుకున్నాడు. నామదేవ్ పాడిన అభంగాలు 60 దాకా సిక్కుల పవిత్ర గ్రంథం'గ్రంథ సాహెబ్'లో చేరాయి.

క్రీ. శ. 1350 లో తన 80 వ ఏట నామదేవ్ పండరిపురంలోనే పరమపదించాడు. సర్వదా భక్తుల పదధూళి సోకడానికి వీలుగా ఆలయంలోకి వెళ్ళే మెట్ల అడుగున ఆయన భౌతిక కాయాన్ని సమాధి చేశారు.

ఆధునిక నాస్తిక దృష్టితో నామదేవ్ జీవిత సంఘటనలు కట్టు కథ లని హేతువాదులు కొట్టివేయవచ్చును. కాని, తరతరాలుగా మహారాష్ట్రులను పరవశం చేస్తున్న నామదేవ్ అభంగాలు వేల సంఖ్యలో నేటికీ నిలిచి ఉన్నాయి. సంసారంపట్ల విరక్తికీ, ప్రగాఢమైన ఆయన భగవద్ భక్తికీ అవి నిదర్శనాలు.

అభంగం 4 పాదాల పద్యం. నాలుగో పాదంలో 'నామ్హాణే' (నామదేవ్ చెబుతున్నాడు) అంటూ ఆయన నామ ముద్ర వస్తుంది. ఒక అభంగంలో ఆయన ఇలా అంటారు:

"అతని నెరుగవు నీ వతడు ని న్నెరుగు
సర్వభూతాలలో సమవర్తి అతడు.
బ్రహ్మయే, హరియె సర్వమ్మటంచు
నమ్ము।
బ్రహ్మమై పోదు నీ వా క్షణమ్మునని।
'అమృతా। మాధవా।' అని పాడుచున్న
దాసుడై యముడు నీ పాదాల వాలేను
నామదేవ్ మదీ నమ్ము-"నమ్మకో హరిని
తూర్పు సేవకుడవై కొలువు మాతనిని,"

నమ్మకాలు సడలిపోతున్న ఈ కలియుగంలో 'భక్త సులభుడు భగవంతుడు' అని మరో సారి రుజువు చేసిన భాగవతోత్తముడు నామదేవ్।

## శరీరం బరువును తగ్గించే యోగ నిద్ర



61.8 కిలో గ్రాముల బరువున్న 'ఆద్రిని పెచిని' అనే స్త్రీ యోగ నిద్ర ద్వారా తన బరువు తగ్గించుకుంది. జాకీ న్యూగెట్ అనే హిప్నోటిస్టు అగస్టు 16 న ఆమెను గాఢమైన యోగనిద్రలోకి పంపి, అగస్టు 28 న తిరిగి ఆమెకు మెలకువ కలిగించాడు. ఆ 13 రోజులూ ఆమె ద్రవాహారం మీదనే ఉంది. ఆ నిద్రలో ఆమె 8.8 కి. గ్రాముల బరువు తగ్గింది.

" 'సంపద' - ఉన్నవాడికి బాధనీ, ఎదుటివానికి ఆశనీ కలిగిస్తుంది." —కోల్టన్

# కార్టూనులు గీయటం ఎలా

టి. వెంకటరావు

## 16

## అవయవ రచన



ఎముకలను అంటి ఉంటే కండరాలు వస్తువుల్ని పైకి ఎత్తడానికీ, కదల్చడానికీ ఉపయోగించే సాధనాలు. మాంస తంతువులతో రూపొందిన కండరాలు ముడుచుకుంటూ, సాగుతూ మన దేహంలో అవయవాలు కదలడానికి సహాయం చేస్తున్నాయి. దేహానికి రూప కల్పన చేసేది కూడా కండరాలే! కండరాలు కొవ్వుతోనూ, చర్మంతోనూ కప్పబడి ఉంటాయి. అందువల్ల కార్టూనిస్టు కండరాల స్వరూప స్వభావాలను గురించి క్షుణ్ణంగా తెలుసుకోడం అవసరం.

శరీరాలను బాగా పోషించుకునే ధనవంతులైన స్త్రీ, పురుషులలో శరీరంలోని కొన్ని భాగాలలో కొవ్వు మరీ ఎక్కువగా కనిపిస్తుంది. పని పాట్లు చేసుకునే పేద సాదల చర్మం క్రింద కొవ్వు అంతగా పేరుకోదు. తరుచు మానవ దేహంలో పొట్ట, పిరుదులు, మెడ, రొమ్ములు, బుగ్గలు, తొడలు వంటి భాగాలలో కొవ్వు ఎక్కువగా కనిపిస్తుంది. అందుకే కార్టూనిస్టు స్త్రీల అవయవాలను వంపులతోనూ, పురుషుల అవయవాలను కోణాలతోనూ సూచిస్తారు.

అవయవ రచనా శాస్త్రం (anatomy) చదువుకోడం కార్టూన్‌లు మరింత అందంగా గీయడానికే కాని, నగ్న చిత్రాలు చిత్రించడానికి కాదు. ఈ సంగతి ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి. చదువుకున్నవారూ, సంస్కారం గలవారూ నగ్న చిత్రాలను ఆదరించరు. (సశేషం)

---

"తిరుగుబాటు లేని జీవితం వసంతం లేని ఋతు వలయం!
కట్టుబాటు లేని తిరుగుబాటు ఎడారిలో వసంతోదయం!" —ఖలీల్ జిబ్రాన్

# మా ఇతడు

(మార్చి 1983)

జి. వెంకటరావు, బరగడ్ (ఒరిస్సా)

"కోటికి పడగ లెత్తిన కోటీశ్వరు లొక వైపు: కోట్లాది అన్నార్తులు మరో వైపు: సోషలిజమ్ నినాదాలు ఇంకో వైపు: అసలు మనం ఎటు వైపు:"
(ఉత్తమ ప్రశ్న)

• అయోమయం వైపు:

• • •

వి. పద్మ & సుమ, బొండిలీపురం

"రంగులు మార్చే రాజకీయ రంగంలోకి రంగులు వేసుకునే నాయకులు వలస పోవడం ఎంత వరకు సమంజసం?"

• రాజకీయాలు రంగులు మారడం మొదలు పెట్టాకనే రంగుల నాయకులు రాజకీయ రంగంలో అడుగుపెట్టి అటుపై పోతున్నారు.

• • •

జి. దుర్గాప్రసాదరావు, పెండ్యాల

"మీరు నటించిన సినిమాలలో మీకు నచ్చిన సినిమా ఏది? అందులో హీరో, హీరోయిను ఎవరు?"

• చాలా సినిమాలు నాకు నచ్చినవి ఉన్నాయి. హీరో మాట అటుంచి 'హీరోయిన్ ఎవరు'? అని అడుగుతావేం? నేనేగా! ఏది చాలా చప్ప ప్రశ్న నాయనా!

• • •

## కృత్రిమ గర్భోత్పత్తి ఫలితంగా పుట్టిన మొదటి శిశువు



కృత్రిమ గర్భోత్పత్తి ఫలితంగా ప్రపంచంలో పుట్టిన మొట్ట మొదటి శిశువు విక్టోరియా కోవాల్‌స్కి. ఆమె తల్లికి ఒక గణిత శాస్త్ర మేధావి వీర్యం ఇంజెక్టు చేయగా ఆమె జన్మించింది.

"మానవులలో మూడు రకాలు: పని చేసేవారూ, చేసినట్టు నటించేవారూ, అదీ ఇదీ కూడా చెయ్యని వారూ!" —పాల్ డి. బ్రౌన్

కె. జ్యోతి, ఆమ్మూరు.

"నాకు బద్ధకం ఎక్కువ. అది పోవా లంటే ఏం చేయమంటారు?"

● తిండి తగ్గించి చూడు! అసలు నీ వయ స్సెంత చెప్పు. దాన్నిబట్టి నీ బద్ధకం పోవడానికి అపాయం లేని ఉపాయం చెబుతాను.

* * *

వేదుల సూర్య సుబ్రహ్మణ్యం, వంటి తాడి అగ్రహారం,

కె. హెచ్. రాజారావు, కొత్తవలస

"వర్ణాంతర వివాహాలు వరకట్న సమ స్యను రూపుమాపవచ్చు నని కొందరి భావన. దీనివల్ల సమస్య పరిష్కారం అవుతుం దంటారా?"

● నేను నటించిన మొదటి చిత్రం 'వర విక్రయం'. వరకట్న సమస్యే ఆ చిత్రం విజయవంతం కావడానికి కారణ మయింది. అదే సమస్య తీసుకొని ఇటీవల కె. విశ్వ నాథ్ 'శుభలేఖ' చిత్రం తీశారు. అదీ ప్రజా దరణ పొందింది. అయినా వర కట్నాలు తీసుకోవడం ఎవ్వరూ మానలేదు. నలభై ఏళ్ళుగా పరిష్కారం కాని సమస్య అంత సులువుగా పరిష్కారం అవుతుందా?

* * *

రాజశేఖర్, నందిగం,

నరసారావుపేట.

"రాళ్ళకూ, చెట్లకూ మ్రొక్కితే లాభ మేమిటి?"

● సర్వవ్యాపి యైన పరమాత్మ అన్నిట్లోనూ, అంతటా వ్యాపించి ఉన్నా డని పెద్దలు కలిగించిన నమ్మకం వల్ల అలా మ్రొక్కుతారు. అందువల్ల మీ కేమిటి నష్టం?

## ప్రముఖ అమెరికన్ సినీతార అసమయం




గ్రేస్ కెల్లీ అనే సుప్రసిద్ధ అమెరికన్ చలనచిత్ర తార ఒక రోడ్డు ప్రమాదంలో తగిలిన గాయాలవల్ల మొనాకో ఆసుపత్రిలో ఇటీవల మరణించింది. 'హై నూన్', 'డయల్ ఎం. ఫర్ మర్డర్', 'రియర్ విండో', 'ది కంట్రీ గరల్' (ఉత్తమ నటిగా ఆమెకు అకడమీ అవార్డు లభించిన చిత్రం) వంటి పలు చిత్రాలలో ఆమె నటించింది. సినీ జీవితానికి స్వస్తి చెప్పి యూరప్‌లోని 'మొనాకో' రాకుమారుడు 'రె నీర్'ను ఆమె వివాహమాడింది.

"స్వేచ్ఛా, సమానతలు వేరు వేరు కావు:
ఒకే ఆదర్శానికి అవి రెండు ముఖాలు!" —హెరాల్డ్ లాస్కీ

కె. రవి శశాంక, రాజమండ్రి.

"గతజన్మ ఫలమే నంటారా - ఈ జన్మ పరిణామం?"

● నిస్సందేహంగా! 'చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా!'అంటారు పెద్దలు. మనం చేసే ప్రతి కార్యంలోనూ మన పూర్వ జన్మ వాసన ప్రతిబింబిస్తూనే ఉంటుంది.

● ● ●

పి. షణ్ముఖరావు, సునాబెడా.

"మనిషికి పట్టెడు అన్నం పెట్టడానికి ఉపయోగపడని ఈ చదువు లెందుకు?"

● నిరర్థకం! అందుకే 'మది దున్నక బ్రతుకవచ్చు మహిలో' అన్న పెద్దల మాట కెంతో అర్థం ఉంది.

● ● ●

ముల్కా శంకర్, నిఘ్వా.

"మన ప్రభుత్వం వీధి కొక సారా కొట్టు ప్రారంభించగలదు గాని, పిల్లలకు సమయానికి పుస్తకాలు అందించలేదా?"

● తనకు మాలిన ధర్మం లేదు నాయనా! పిల్లల పుస్తకాలవల్ల వచ్చే లాభం కంటె సారాయివల్ల వచ్చే లాభం ఎక్కువ గదా! ప్రభుత్వానికి ఖజానా నిండాలి మరి!

● ● ●

బెజుగం భాస్కర్, హైదరాబాద్.

"మనిషిలోని మానవత్వం, మంచీ అనేవి ఏ విషయంలో బయట పడతాయి?"

● ఆపదలో ఉన్న సాటి మానవుణ్ణి ఆదుకోడంలో!

గంధం వెంకటేశ్వర రావు, వెంకటాయపాలెం.

" 'ఆంధ్రులు ఆరంభ శూరులు' అంటా రేమిటి అక్కా?"

● ఆ మాట అక్షరాలా నిజమే తమ్ముడూ! అది కాదని నిరూపించే వీరులు వచ్చేటంత వరకూ ఆంధ్రులు 'ఆరంభ శూరులు' మాత్రమే కాదు; 'రభస శూరులు' కూడా!

● ● ●

డి. ఎన్. రావు, నెల్లూరు.

"దేవాలయాలలో గంట లెందుకు?"

● గంట మ్రోగిస్తే ఆ శబ్దంలోని 'ఓంకారం' దేవుని చెవిని పడుతుం దనీ, ఆ భక్తుణ్ణి భగవంతుడు ఆశీర్వదిస్తా డనీ - అనుకుంటాను. ●

## ఆహారం లేకుండా నెల రోజులు జీవించే పక్షి



'ఫీజెంట్' అనే నెమలి జాతి పక్షి పూర్తిగా నెల రోజులపాటు ఆహారం లేక పోయినా జీవించగల దట!

"వివేకం వల్ల కలిగే అనుభవం మిత్రుడు;
అజ్ఞానంవల్ల కలిగే అనుభవం శత్రువు." —యంగ్

# ఊరడింపు మాటలు

ఎన్. ఎస్. వెంకటరామన్



[ఎర్నాకులంలోని 'సేక్రెడ్ హార్ట్ కాలేజ్' లో విద్యాభ్యాసం చేసి శ్రీ ఎన్.ఎస్. వెంకటరామన్ కేరళ విశ్వవిద్యాలయం నుంచి వాణిజ్య శాస్త్రంలో పట్టభద్రు లయారు. ప్రస్తుతం బొంబాయిలోని 'లార్సెన్ అండ్ టూబ్రో లిమిటెడ్'లో పని చేస్తున్నారు.]

జీవసత్తువ ఉడిగి జీవచ్ఛవంలా కనిపిస్తున్న ఆ అవ్వగారు నన్ను దగ్గిరికి రమ్మని సంజ్ఞ చేసి ఇలా వాపోయింది:

"డబ్బు! డబ్బు! డబ్బు! ఎవరికి కావాలి నాయనా డబ్బు? కొడుకులూ, కూతుళ్ళూ ఎవ్వరూ వచ్చి నాలుగు రోజుల పాటు నా దగ్గిర ఉండరు గదా! ఈ ఒంటరితనం భరించ లేక పోతున్నాను. ఎప్పుడు వారు కంటపడ తారా అని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తూ ఉంటాను. మనుషుల కోసం, మనుమరాళ్ళ కోసం ప్రాణం కొట్టుకుంటుంది!"

"త్వరలోనే వచ్చి మీ యోగ క్షేమాలు విచారించ మని మీ వాళ్ళతో నేను చెబుతాను లెండి!" అంటూ ఆమెను ఓదార్చాను. చిన్న చిన్న పనులు చేసి పెడుతూ, ఆమెకు సేవ చేశాను. ఊరడింపుగా మాట్లాడాను. చిత్రంగా చూస్తూ ఉండగానే ఆమెలో ఎంతో మార్పు వచ్చింది. ఆమె ముఖంలో కొత్త కాంతీ, కొత్త ఉత్సాహం వెల్లివిరిశాయి. సొంత

## ఔషధంగా మామిడి చెట్టు

మామిడి చివుళ్ళను ఎండబెట్టి చేసిన చూర్ణం నీళ్ళ విరేచనాలనూ, మధుమేహ వ్యాధినీ తగ్గిస్తుంది. మామిడి ఆకులు కాల్చగా వచ్చే పొగ గొంతు సంబంధమైన వ్యాధుల మీద పని చేస్తుంది. మామిడి బెరడు రక్త విరేచనాలనూ, మూలశంక వ్యాధినీ నయం చేస్తుంది. పచ్చసెగ వ్యాధికి మామిడి బెరడు రసం నిమ్మకాయ నీళ్ళతో కలిపి ఇస్తారు.

"మానవ జీవితం కల్మష భూయిష్ఠం కాదు;
ఆత్మ ప్రాప్తికి అది సాధనం!" —శ్రీ అరవిందులు

కొడు దగ్గిర కూచుని మాట్లాడు తున్నంతగా ఆమె సంబర పడింది.ఆప్యాయంగా కావలించు కొని ఆ పూట అక్కడే ఉండి పొమ్మని బల వంతం చేసింది. ఆమె నొచ్చుకోకుండా "త్వరలోనే మళ్ళీ వస్తా గదా! బామ్మగారూ!" అంటూ ఎలాగో ఆమెకు నచ్చజెప్పి, నేను బయటపడ్డాను.

ఇలాంటి సంఘటనలు తరుచు మనకు ఎదురవుతూ ఉండేవే! "ఊరడింపు మాటలు ఔషధం లాగ పనిచేస్తాయి" అంటారు మన శాస్త్రవేత్తలు. ముఖ్యంగా ఆ అవ్వగారిలాంటి వారి మీదా, వయోవృద్ధులు కాకపోయినా వ్యాధి గ్రస్తులై మంచం పట్టిన వారి మీదా ఊరడింపు మాటల ప్రభావం అమోఘం. క్రుంగిపోయి ఉన్న సమయంలో ఆదరంగా పలుకరించే గొంతు కోసం మనం తహ తహ లాడుతాం. మిత్రులూ, బంధువులూ ఆ అవసరం తీర్చాలి. సానుభూతి మాటలు మనస్సు మీద అద్భు తంగా పని చేస్తాయి.

"ఇవాళ చస్తే రేపటికి రెండు" అంటూ వేదాంతం కబుర్లు చెబుతారు గాని ప్రతివారికీ ఆత్మీయుల చావు పెద్ద ఆఘాతం అవుతుంది. గుండె దిటవు ఉన్న ఏ కొద్దిమందో తప్ప ఆ దుఃఖాన్ని తట్టుకొని నిలబడ లేరు. ఒక్క సారిగా జీవితం శూన్యం అయిపోయినట్టు అని పిస్తుంది. సరిగ్గా అలాంటి సమయాలలోనే తోటివారి ఆసరా, ఆదరం మనకు కావలసి వస్తాయి. వచ్చిన కష్టాన్ని ఎదుర్కొని మళ్ళీ ధైర్యంగా జీవించడానికి ఊరడింపు మాటలు సహాయం చేస్తాయి.

సానుభూతి సందేశాలు పంపడంలో ఉన్న రహస్యం ఇదే! వారి దుఃఖంలో మనం పాలు పంచుకోడం వల్ల వారి దుఃఖ తీవ్రత కొంత తగ్గుతుంది.

దుఃఖ సమయంలోనే కాదు - ఊరడింపు మాటలు అవసరం అయ్యేది. ఓదార్పు మాటలు నూతన ఉత్సాహాన్ని కూడా కలిగించగలవు. నిరాశతో, నిస్పృహతో ఒక్కొక్కప్పుడు క్రుంగిపోవడం జరుగుతుంది. జీవితంలో తరుచు పరాజయాలను ఎదుర్కోవలసి వస్తుంది. నిర్లిప్తత అలవరచుకొని, ఆ పరా జయాలను ఏ మాత్రం పట్టించుకోకుండా తిరిగి తిరిగి ప్రయత్నం చేసే స్థితప్రజ్ఞులు బహుకొద్ది

## పశువుల ఆసుపత్రిలో నర్సుగా 'చింపంజీ'



జపాన్‌లో 'చోసుకే' అనే పేరు గల ఒక మగ చింపంజీ కోతికి నర్సు శిక్షణ ఇచ్చి ఒక పశువుల ఆసుపత్రిలో పని చేయి స్తున్నారు. జుంకీ ఉయామా అనే పశువుల సర్జన్‌కి ఎంతో విజాయితీతో, ఓర్పుతో ఆ నర్సు సాయం చేస్తున్నాడు.

"పీ వ్యతిరేకులను చూసి భయపడకు: ఎదురు గాలిలోనే గాలిపటం ఇంకా ఇంకా పైకి లేస్తుంది!" — మేబీ

మంది. ప్రతికూల పరిస్థితులు ఎదురైతే మనలో చాలామంది ఆ ఊబిలో నుంచి బయట పడలేక గిలగిల కొట్టుకుంటూ ఉంటాం. ఆ సమయంలో ప్రోత్సాహకరమైన ఒక్క మాట మనకు ఏను గంత సత్తువ నిస్తుంది. మన గోడు వినిపించుకునే వారు లేకపోతే నిరాశ, నిస్పృహ మనల్ని కబ ళించి వేస్తాయి. ఓర్పుగా మన సొద అంతా విని మనకు ఎవరైనా ధైర్యం చెబితే మన స్సుకి ఎంతో ఊరట కలుగుతుంది.



భార్యా భర్తల మధ్య దాంపత్య జీవితం సుఖంగా సాగాలంటే పరస్పరం ఊరడింపు మాటలు చెప్పుకుంటూ ఉండడం అవసరం. తెలివైన భార్య సంసారాన్ని స్వర్గ తుల్యం చేయ గలదు. ఒక పురుషుడు ఘన విజయాలు సాధిస్తే అనుకూలవతి అయిన అతని భార్యే అందుకు కారణం. పరాజయాలలో భర్తకు బాసటగా నిలిచి విజయంవైపు అతణ్ణి ఆమె నడిపిస్తుంది.

ఒక్కొక్కప్పుడు మనల్ని మనమే ఓదార్చుకోడం అవసరం అవుతుంది. అలాంటి సందర్భాలలో మతం, ఆధ్యాత్మిక ప్రసంగాలు చాలా సహాయం చేస్తాయి. పురాణ కథల దృష్టాంతాలతో అవి సంఘానికి తారక మంత్రాలుగా పనిచేస్తాయి. అలాంటి ప్రసం గాలు ముసలివారి కోసమే ఉద్దేశించబడ్డాయను కోడం పొరపాటు. నిజానికి తగినంత అను భవం లేని యువకులకే అవి ఎక్కువ మేలు చేస్తాయి.

మన చుట్టూ నిత్యం ఎందరికో మన 'ఊర డింపు మాటలు' అవసరం అవుతాయి. ఎలాగో తీరిక చేసుకుని కష్టంలో ఉన్న మన సాటి వారిని ఆదుకోడం, వారికి ఊరడింపు కలిగించడం మన కర్తవ్యం!

## ముఖ చిత్ర వ్యాఖ్య

(జనవరి 1983)

"నాటి శాంతి చిహ్నం!
నేటి అశాంతి నిలయం!"

—బి. సాయి ప్రసాద్‌రావు
జనగాం (వరంగల్ జిల్లా)

* * *

"ఇదేనండి ఇదేనండి భాగ్యనగరమూ!
మూడుకోట్ల ఆంధ్రులకూ ముఖ్యపట్నమూ!"
—యు. హెచ్. ప్రసాద్, హైదరాబాద్-48.

* * *

"అప్పుడు ప్లేగు వ్యాధి నివారణ స్మారకార్థం
ఇప్పుడు యాత్రికుల దర్శనార్థం!"

—ఎ.యస్.యస్. శంకరరావు,
విజయవాడ - 10.

"స్వేచ్ఛ అంటే బాధ్యత: అందుకే స్వేచ్ఛ అంటే అత్యధికులు భయపడతారు!" —బెర్నార్డ్ షా

# నవ్వు

## "తక్కిన అయిదింటినీ కూడా లోపలికి రానీ!"

భర్త: డియర్! ఇప్పుడీ గదిలో టెంపరేచర్ ఎంత?

భార్య: 15 డిగ్రీలు సెంటిగ్రేడ్.

భర్త: బయట?

భార్య: 20 డిగ్రీలు.

భర్త: తలుపు తీసి పాపం - తక్కిన అయిదింటినీ కూడా లోపలికి రానీ!

* * *

## "వాటికిడబ్బుతీసుకోనులెండి!"

కాతాదారు: చూడు అమ్మా! ఈ గుడ్లు చాలా నిలవ సరుకు. ఈ పాటికి వాట్లో కోడి పిల్లలు తయారైనా తయారై ఉండచ్చు!

కొట్టుమీది అమ్మాయి: ఫరవాలేదు — వాటికి మీ దగ్గిర డబ్బు తీసుకోను లెండి!

* * *

## "ఇల్లు అసలు కనబడందే!"

పెద్ద తుపాను వచ్చి నానా బీభత్సం చేసింది. తుపాను బాధితులలో ఒకరు మరొకరితో: "తుపాన్‌లో నీ ఇల్లు కూడా దెబ్బతిందా బాబూ?"

"ఏ సంగతీ చెప్పడం కష్టం. అసలు ఇల్లే ఇంకా కనపడందే!"

## మలేరియా నయం చేసే ఓషధి



'కాప్టిస్ టీటా (Coptis Teeta) అనే ఒక అద్భుతమైన ఓషధిని అరుణాచల ప్రదేశ్‌లో దిబాంగ్ లోయలోని మిష్మీ తెగవారు మలేరియా, వెన్ను నొప్పి మొదలైన వ్యాధుల నివారణకు ఉపయోగిస్తున్నారు. ఈ ఓషధి వేళ్ళవద్ద పెరిగే అల్లంవంటి గడ్డలు 3 రాత్రి పూట నీటిలో వేసి ఉంచి, మర్నాడు ఉదయం ఆ నీటిని రోగులకు ఇస్తారు. ఈ దుంపల చూర్ణాన్ని కళ్ళ వాపు తగ్గించేందుకు 'సుర్మా'గా కూడా ఉపయోగిస్తున్నారు.

---

"నువ్వు కోపంతో ఉన్న ప్రతి నిమిషం అరవై సెకండ్ల ఆనందాన్ని కోల్పోతున్నావు!"

## "మీరు ఎలా గుడ్లు పెడతారు సార్?"

లెక్కల మాస్టరు: ఇదిగో - ఈ లెక్క వ్రాసుకోండి. నేను ఒక బుట్టలో 4 గుడ్లూ, మరో బుట్టలో 4 గుడ్లూ పెట్టా ననుకోండి. మొత్తం నేను ఎన్ని గుడ్లు పెట్టినట్టు?

విద్యార్థి: మీరు గుడ్లు పెట్టడం ఎలా సాధ్యం సార్?

* * *

## "లేచి నిలబడడం మంచిది!"

ఒక దేశం నియంత మారు వేషంలో ఒక సినీమా హాలుకి వెళ్ళి వెనకాల సీట్లో కూచుని సినీమా చూస్తున్నాడు. ఉన్నట్టుండి ఆ నియంత బొమ్మ తెరమీద కనిపించింది. హాలులో అందరూ లేచి నిలబడి దానికి వందనం చేస్తున్నారు. అతడు మాత్రం అలాగే కూచుని ఆ తమాషా చూసి ఆనందిస్తున్నాడు. అంతలో సినీమాహాలు ఉద్యోగి ఒకడు వచ్చి ఇలా అన్నాడు: "బాబూ! నువు కూడా లేచి నిలబడు! నీలాగే నాకూ అతనంటే ఇష్టం లేదు. అయినా లేచి నిలబడడం మనకే మంచిది!"

* * *

## "మిమ్మల్ని సంప్రదించమని!"

పెద్ద డాక్టరు రోగిని పరీక్షచేస్తూ ఎన్నెన్నో ప్రశ్నలు అడుగుతున్నాడు.

"నా దగ్గిరికి రావడానికి ముందు నువు డా. బ్లాంక్ దగ్గిరికి వెళ్ళా వనుకుంటాను. అతడు నీ కిచ్చిన బోడి సలహా ఏమిటి?"

"వెంటనే మిమ్మల్ని సంప్రదించ మని!"

## "మునిగిపోయి దొరికాడు!"

బల్లకట్టుమీద నది దాటుతూ ఒక ఆసామీ పడవవానితో అన్నాడు: "ఇంతకు ముందెప్పుడైనా ఈ నదిలో జననష్టం అయిందా?"

పడవవాడు: "ఎన్నడూ లేదు. క్రిందటి వారం మా తమ్ముడు కొట్టుకుపోయినా, మర్నాడు మళ్ళీ అతని శవం మాకు దొరికింది."

## ఎవరెస్ట్ శిఖరానికి ఆ పేరెలా వచ్చింది?



1830 లో జార్జి ఎవరెస్ట్ అనే ఆంగ్లేయుడు కలకత్తాలోని సర్వే ఆఫీసులో సూపరింటెండెంట్‌గా నియమించబడ్డాడు. ఆయన పర్యవేక్షణలోనే ప్రపంచంలోని పర్వత శిఖరాలన్నిటిలోకీ ఎత్తైనది హిమాలయాలలో ఉన్న దని గుర్తించారు. కాలక్రమేణ ఆయన పేరే ఆ శిఖరానికి రూఢి అయింది.

"ఆశయ శుద్ధి లేని జీవితం చుక్కాని లేని నావ వంటిది." — స్వామి శివానంద

# వియెన్నాలో సిటీ బస్సులు

అమ్రిక్ సింగ్ బ్రార్హక్

ప్రపంచంలో వివిధ దేశాల రాజధాని నగరాలూ, ఇతర ప్రముఖ నగరాలూ కూడా ఈ నాడు ఎదుర్కొంటున్న రెండు ప్రధాన సమస్యలు: జనాభా ఒత్తిడి, నగరంలో ప్రయాణ సౌకర్యాల ఏర్పాటు. పల్లె ప్రాంతాల నుంచి నగరాల వైపు జనాభా తరలిపోతూ ఉండడంతో ఏటి కాఏడు నగరాలలో జనాభా ఒత్తిడి ఎక్కువ అవుతూంది. కొన్ని



దశాబ్దాలుగా పరిశ్రమలకూ, వాణిజ్యానికీ మనం అధిక ప్రాధాన్యం ఇస్తూ ఉండడం కూడా ఇందుకు దోహదం చేస్తూంది.

నగరాలలో జనాభా ఒత్తిడికీ, నగరాలలోని ప్రయాణ సౌకర్యాల ఏర్పాటుకీ దగ్గిర సంబంధం ఉంది. వివిధ ప్రభుత్వ శాఖలు ఒక పథకం ప్రకారం కలిపి కట్టుగా పని చేస్తే తప్ప ఈ సమస్యలను పరిష్కరించడం కష్టం. సంతృప్తికరంగా ఈ సమస్యలను పరిష్కరించుకున్న ఒక నగరం వియెన్నా (ఆస్ట్రియా దేశం రాజధాని). యూరప్‌లోని ఇతర దేశాల రాజధాని నగరాలలో కంటె ఇక్కడ జనాభా ఒత్తిడి చాలా తక్కువ. ఇక - నగరంలో ప్రయాణ సౌకర్యాల ఏర్పాటు విషయంలో వియెన్నా సాధించిన విజయం ఘనమైంది; ఇతరులు చూసి అనుకరించదగింది.

ఈ నాడు వియెన్నాలో ఉన్నన్ని ట్రామ్ లైన్‌లు ప్రపంచంలో మరి ఏ నగరంలోనూ లేవు. 'వియెన్నా ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ' చౌక ధరలతో నగరం మూల మూలలకు

## ఇండియాలో ఆహార ధాన్యాల

ట

హైదరాబాద్‌లోని 'జాతీయ భూగర్భ శాస్త్ర పరిశోధక సంస్థ' డైరెక్టరు డా. హరి నారాయణ్ అంచనాల ప్రకారం గంగానదీ లోయలోని భూగర్భ జలాన్ని పూర్తిగా వినియోగించుకుంటే ఇండియాలో ఆహార ధాన్యాల ఉత్పత్తిని రెట్టింపు చేసి, 30 కోట్ల టన్నులకు పెంచవచ్చును.

"దేశం అభివృద్ధి చెందడం అంటే అద్దాల మేడలూ,
... కాదు: పౌరుని వెతికాలి వృద్ధే దేశాభివృద్ధి!" —గాంధీజీ

కూడా ప్రయాణం చేసే సౌకర్యం కల్పించింది. భూగర్భ రైలు మార్గం ద్వారా కాకుండా ట్రామ్‌ల మీద పోవడంలో మరో లాభం కూడా ఉంది. ట్రామ్‌లో పోతూనే నగరంలోని అందమైన స్థలాలన్నీ హాయిగా చూడవచ్చు.

నగరంలోని ప్రయాణ సౌకర్యాలలో ముఖ్యంగా చెప్పుకోదగిన ట్రామ్ కారులు ప్రయాణికులకు - వారు ముందుగా తెలుసుకుని ఉపయోగించుకోవాలే గాని - ఎన్నెన్నో సౌకర్యాలు ఏర్పాటు చేశాయి. ఉదాహరణకు ట్రాం టిక్కెట్టు ముందుగానే ఏ పొగాకు కొట్టు toba c mist's shop) లోనో మనం కొనుక్కోవడం మంచిది. అలా కాకుండా ట్రాం కారులో టిక్కెట్టు తీసుకొంటే ఖరీదు ఎక్కువ. అలాగే - టూరిస్టులు ఒక వారం రోజులు వియెన్నాలో గడపా లనుకుంటే ఫోటో కూడా అంటించి ఇచ్చే 'వీక్లీ పాస్' తీసుకోడం మరింత చౌక. ఈ సౌకర్యాల సంగతి తెలియ జెప్పే కరపత్రాలు అందుబాటులో ఉన్నా చాలా మంది టూరిస్టులు ఈ సౌకర్యాలు ఉపయోగించుకోడం లేదు.

వియెన్నాలో టిక్కెట్ల ధరలు ఏర్పాటు చేసిన విధానం చాలా సరళమైంది. నగరంలో వేర్వేరు 'జోన్' (ప్రాంతం) లు అంటూ లేకపోవడంవల్ల మాటి మాటికీ నగరం మ్యాపు చూసుకునే పని ఉండదు. ట్రామ్‌లకూ, బస్సులకూ, భూగర్భంలో పోయే రైళ్ళకూ వేర్వేరు టిక్కెట్లు అవసరం లేదు. ఒకే టిక్కెట్టు అన్నిటికీ చెల్లుతుంది. నగరంలో 414 కి.మీ.ల దూరం వెళ్ళేదాకా ఒకటే టిక్కెట్టు - యూనివర్సిటీ నుంచి రింగ్ రోడ్డు మీదుగా సిటీ పార్కులో ఉన్న స్ట్రాస్ స్మారక చిహ్నం దాకా వెళ్ళినా సరే, లేదా నగరం ఉత్తరాన ఉన్న హ్యూరిజెన్ నుంచి దక్షిణాన ఓబెర్లా లోని 'ఆరోగ్యం కోలుకొనే

---

## యాలకుల పంటలో ఇండియా ప్రశస్తి



ప్రపంచంలో ప్రస్తుతం ఇండియాయే యాలకులు ఎక్కువగా పండిస్తూంది. ప్రపంచ ఉత్పత్తిలో 67 శాతం ఇండియాలో ఉత్పత్తి అవుతూంది. గ్వాటిమాలా, టాంజేనియా, శ్రీలంక దేశాలు కూడా యాలకులు పండిస్తున్నాయి. కేరళ, కర్ణాటక, తమిళనాడు - ఈ మూడు దక్షిణాది రాష్ట్రాలలోనే యాలకి పంట ఎక్కువ. ఇండియన్ యాలకులు ముఖ్యంగా రష్యాకీ, అరబ్ దేశాలకూ, ప. జర్మనీకీ, సింగపూరుకీ ఎగుమతి అవుతున్నాయి.

---

"విద్యావంతుడు నేను 'విద్యావంతుణ్ణి' అనుకున్న మరు క్షణం తన విజ్ఞానాన్ని కోల్పోతాడు."

—గోర్కీ

వారి పార్కు' (health resort park) దాకా వెళ్ళినా సరే!

1 కి.మీ. దూరానికైనా, 20 కి.మీ. దూరానికైనా ఒకటే ఛార్జి. మధ్యలో ఒక ట్రాం దిగి మరో ట్రాం ఎక్కినా ఆ టిక్కెట్టే పనికొస్తుంది. ఎన్నిసార్లైనా అలా మధ్యలో దిగచ్చు. అయితే మనం ఒకే దిశలో ప్రయాణిస్తున్నంతవరకే ఆ టిక్కెట్టు చెల్లుతుంది. నగరం చుట్టి రావడానికి గాని, దిగిన స్టాప్‌లో కాకుండా తరువాతి స్టాప్‌లలో ఎక్కితే గాని ఆ టిక్కెట్టు పనికి రాదు.

అన్నిటి కంటె అద్భుతమైన సంగతి: వియెన్నాలో ట్రాం కార్లలో కండక్టరులు ఉండరు. ట్రాం కారు మీది నీలి గుర్తు దానిలో కండక్టరు లేదు అని సూచిస్తుంది. ఒక 10 షిల్లింగ్‌ల నాణెం చేత బుచ్చుకుని ట్రాం తలుపు మీది పసుపు పచ్చని గుర్తు సూచించే చోటుకి వెళ్ళి స్లాట్ మిషన్‌లో టిక్కెట్టు తీసుకోవాలి. ముందుగానే 'పింక్' రంగు టిక్కెట్టు కొనుక్కొని ఉంటే నీలిరంగు పెట్టె వద్దకు వెళ్ళి దానిమీద స్టాంప్ వేసుకోవాలి!

ట్రాం దిగేటప్పుడు తలుపు పక్కన ఉన్న బటన్ నొక్కితే డ్రైవరు ట్రాం ఆపుతాడు.

వియెన్నాలో నగర రవాణా విధానం అభివృద్ధి చెందిన క్రమాన్ని 'వియెన్నా ట్రాం వే మ్యూజియమ్' లో కళ్ళకు కట్టినట్టు చూడవచ్చును.

నానాటికీ జనాభా పెరిగిపోతూ, ట్రాఫిక్ విఘాతాలు ఎక్కువగా ఏర్పడుతున్న మన నగరాలలో ఆలస్యం, ప్రమాదాలూ తగ్గించుకోడానికి ఆదర్శప్రాయమైన వియెన్నా రవాణా విధానం నుంచి మనం నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది. ●

## గర్భస్థ శిశువు మీద సారా ప్రభావం!



గర్భవతిగా ఉన్న స్త్రీ ఎక్కువగా మద్యం సేవిస్తే ఆమె గర్భంలోని పిండంలో అనారోగ్య లక్షణాలను గుర్తించినట్టు 1972 లోనే వైద్యశాస్త్ర పత్రికలో రిపోర్ట్ అయింది. 'జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్' (1978 మార్చి) లో ప్రకటితమైన ఒక వ్యాసంలో గర్భవతి కావడానికి ముందు నెలలో స్త్రీ సేవించిన మద్యం ప్రభావం పిండం మీద మిక్కిలి ఎక్కువగా ఉంటుం దని ప్రకటించారు.

('హవాయ్ హెల్త్ మెసెంజర్'సౌజన్యంతో)

"ఇతరులకు బోధించే ముందు తను ఆచరించి చూపాలి: ఆత్మ నిగ్రహం ఉన్నవాడే ఇతరులను కట్టుబాటులో ఉంచగలడు." -గౌతమ బుద్ధుడు

# జాతీయ వార్తలు

## ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కమీషన్‌కి అత్యధిక లాభాలు:

ప్రభుత్వ రంగంలో పనిచేస్తున్న ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కమీషన్ 1981-82 వ సం. రంలో వెనుకటి కంటె 14 రెట్లు ఎక్కువ లాభాలు గడించినట్లు తెలుస్తూంది. 1980-81 లో రూ. 46.37 కోట్లు మాత్రమే లాభం రాగా, 1981-82 లో పన్నులు చెల్లించక మునుపు లాభం రూ. 650 కోట్లు అయింది. నూనె ఉత్పత్తి 43 శాతం పెరగడం ఇందుకు కారణం అంటున్నారు.

* * *

## 10 వ శతాబ్ది నాటి బౌద్ధారామం:

లడక్ (జమ్ము అండ్ కాశ్మీర్ రాష్ట్రం) డివిజన్‌లోని 'సుందాఛీ' గ్రామం సమీపంలో సముద్ర మట్టానికి 12,500 అ.ల ఎత్తున జరిపిన త్రవ్వకాలలో ఈ మధ్య 10 వ శతాబ్దికి చెందిన ప్రాచీన బౌద్ధారామం ఒకటి బయట పడింది. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం శాలూకు ప్రముఖ పరిశోధకులు డా. అజయ కుమార్ సింగ్ కనుగొన్న ఈ బౌద్ధారామాన్ని సుప్రసిద్ధ టిబెట్ బౌద్ధ భిక్షువు లోట్సావారించెన్ జంగ్ నిర్మించా డని అక్కడి స్థానికులు విశ్వసిస్తున్నారు.

* * *

## 1982 ప్రపంచ సుందరి



డొమినికన్ రిపబ్లిక్ (మధ్య అమెరికా)కు చెందిన 22 ఏళ్ళ వయస్సు గల మిస్ మరియ సెలా ఆల్వరెజ్ లెబ్‌రాన్ 1982 ప్రపంచ సుందరిగా ఎన్నిక అయింది. 1982 నవంబరు 18 న లండన్‌లోని రాయల్ ఆల్బర్ట్ హాల్‌లో జరిగిన 32 వ వార్షిక సౌందర్య ప్రదర్శనలో ఈ ఎన్నిక జరిగింది. 5,000 పౌన్లకు ఒక చెక్ ఆమెకు ఇచ్చారు. ఒక బయాలజీ ప్రొఫెసర్ 4 గురు కుమార్తెలలో కడగొట్టు కూతురైన మిస్ ఆల్వరెజ్ వాస్తుశాస్త్రం (architecture) ఇంజనీరింగ్‌లో మొదటి సంవత్సరం విద్యార్థిని.

"మాటలు ఆకుల్లాంటివి: అవి మరీ ఎక్కువ అయితే వాటి అడుగున పండ్లు వంటివి కనబడకుండా పోతాయి." -అలెగ్జాండర్ పోప్

## 1985 మార్చి నాటికి పల్లె పల్లెకూ ఒక బ్యాంకు :

పల్లె పల్లెకూ బ్యాంకు శాఖలు విస్తరింప జేయడానికి 'రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా' తయారు చేసిన మూడు సంవత్సరాల పథకం ప్రకారం 1985 మార్చి ఆఖరుకి ఇండియాలో 17,000 జనాభా ఉన్న ప్రతి బ్లాక్‌లోనూ ఒక బ్యాంకు బ్రాంచి తెరవబడుతుంది.

* * *

## విద్యాధికులైన నిరుద్యోగులలో పశ్చిమ బెంగాల్ ఆధిక్యం :

ఇండియాలో ఇతర రాష్ట్రాలలో కంటె విద్యాధికులైన నిరుద్యోగులు ప. బెంగాల్ రాష్ట్రంలో ఎక్కువ. అక్కడ నమోదు అయిన నిరుద్యోగుల సంఖ్య 28.49 లక్షలు. దేశం మొత్తం మీద 1982 మార్చి నెలాఖరుకి నమోదైన విద్యావంతులైన నిరుద్యోగులు 1.80 కోట్లు.

* * *

## తెలుగుదేశంలో మరో 10 లక్షల టన్నుల సిమెంట్ ప్లాంటు :

'సిమెంట్ కార్పరేషన్ ఆఫ్ ఇండియా' వారు తాండూరు వద్ద కొత్తగా 10 లక్షల టన్నుల సిమెంటును ఉత్పత్తి చేసే ప్లాంట్ ఒకటి నెలకొల్పుతున్నారు. ఇంధనాన్నీ, విద్యుచ్ఛక్తినీ పొదుపుగా వాడేందుకూ, సులువుగా నడిచేందుకూ, సిమెంటు నాణ్యత తగ్గకుండా చూసేందుకూ యంత్రాలలోనే ఏర్పాట్లు అమర్చబడి ఉన్న ఇలాంటి ఫ్యాక్టరీ ఇండియాలో ఇదే మొదటిది.

* * *

## థెర్మల్ విద్యుత్ కేంద్రాలలో లిగ్నైట్ వాడుక :

బికనీర్ జిల్లాలోని 'పలానా' వద్ద రాజస్థాన్ ప్రభుత్వం లిగ్నైట్‌ని ఇంధనంగా వాడుక చేసే 120 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయగల థెర్మల్ పవర్ స్టేషన్‌ను నిర్మిస్తున్నారు. రూ. 260 కోట్లు ఖర్చయ్యే ఈ కేంద్రంలో ఒక్కొక్కటి 60 మెగావాట్ల

(మిగతా 32వ పేజీలో)

## గొర్రెకి రికార్డు ధర



ద. ఆస్ట్రేలియాలో జరిగిన 'ది రాయల్ అడిలైడ్ గొర్రెల ప్రదర్శనం'లో ఇటీవల జిమ్ బెల్ దంపతులు ఒక గొర్రెను 60,000 ఆస్ట్రేలియన్ డాలర్లు ఇచ్చి కొన్నారు. గొర్రెల ధరలలో ఇదే రికార్డు. వెనుకటి రికార్డు 46.000 డాలర్లు. 1976 లో అ ...కం కూడా 'ది రాయల్ అడిలైడ్ గొర్రెల ప్రదర్శనం' లోనే జరిగింది.

"సరళత్వం పని చేయని సమయంలో కఠినత్వం అవలంబించడం సమంజసమే!" —కార్లైల్

# వ్యక్తిత్వం పెంచుకోడం ఎలా

శ్రీమతి ఎన్. ఇ. భాగ్యవతి



[శ్రీమతి ఎన్.ఇ. భాగ్యవతి (జననం: 1944) తిరుపతిలోని శ్రీ పద్మావతీ మహిళా కళాశాలలోనూ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాలలోనూ చదివి, "సైకాలజీ" (మనశ్శాస్త్రం)లో ఎం.ఎ. పట్టం పొంది, ప్రస్తుతం "ఆత్మ వాస్తవీకరణం" (self-actualization) అనే విషయం మీద పి. హెచ్. డి.; డిగ్రీకోసం పరిశోధన చేస్తున్నారు. కుల రహిత సమాజ స్థాపన సాధ్యం అని ఆమె విశ్వాసం.]

చాలామంది మనశ్శాస్త్ర వేత్తలు ఈ నాడు 'వ్యక్తిత్వం' అనే మాటను 'జ్ఞానం' కంటె ఇతర మైన లక్షణాలకు పరిమితం చేస్తున్నారు. ముఖ్యంగా - సంఘం మీద తన ప్రభావం చూపించేందుకూ, తన జీవితం ఆనందమయం చేసుకునేందుకూ వ్యక్తికి తోడ్పడే లక్షణాలే అతని 'వ్యక్తిత్వం'గా పరిగణించబడుతున్నాయి. నిజమైన గొప్ప వ్యక్తి తనకు పేరు ప్రతిష్ఠలు సమకూర్చిన విజయాలవల్ల కాక, తన నిజమైన స్వరూపం వల్లనే మనల్ని ఎక్కువగా ఆకర్షిస్తున్నాడు. 'మనిషి ఎంత లోతైన వాడైతే అంత ఉన్నతు డవుతాడు' అని ఆర్యోక్తి!

నిజంగా విద్యావంతు డైన వ్యక్తి కేవలం వివిధ విషయాలను గురించిన భోగట్టా సేక

---

## భావ పరిచయ పోటీ

(జనవరి 1983)

"అతిరథ మహారథులు!"

—పి. ఆర్. హరినాథ్, అనంతపురం.

* * *

"ఒకడు ప్రజల దొంగ!
మరొకడు దొంగల దొంగ!!"

—బి పి. ప్రమోద్ రాజ్,
హైదరాబాద్ - 2.

"కష్టపడకుండా సంపాదించింది
కలకాలం నిలువదు!"

—లంక ఫణీంధర్, తుంగభద్ర డామ్.

"పొగిడే వాడితో జాగ్రత్తగా ఉండు,
ఖాళీ చెంచాతో తినిపిస్తూ ఉంటాడు వాడు." —గ్రిగ్రియా

శించడం మాత్రమే కాక, కొన్ని జీవిత సూత్రాలనూ, తన కొక ప్రత్యేక జీవిత దర్శనాన్నీ ఏర్పాటు చేసుకోవాలని ప్రయత్నిస్తాడు. ఫ్యాషన్లతో పాటు వచ్చే కప్పుడు మారుతూ ఉండేది. కాని, గ్రహించిన జీవిత సూత్రాలు మాత్రం స్థిరంగా నిలిచి ఉంటాయి. చక్కని నిర్ణయాలు తీసుకునేందుకు అలాంటి సూత్రాలు తోడ్పడుతాయి. అంతే కాక, అవి మనకు కొన్ని విలువలను అలవరచి, తద్వారా మన వ్యక్తిత్వానికి పుష్టిని చేకూరుస్తాయి. చౌకబారు తనానికీ, హుందాతనానికీ మధ్య, అల్పత్వానికీ, ఔదార్యానికీ మధ్య ఉన్న తేడాని గుర్తించేందుకు కూడా అవి తోడ్పడుతాయి. ఆ విధంగా వ్యక్తిత్వంలో పరిపక్వత సాధించిన వారిలో నిండుతనం, అధికారం, పలుకుబడి కనిపిస్తాయి.

వ్యక్తిత్వంలో పరిపక్వత ఏర్పడడం అంటే - ఆ వ్యక్తి ఇతరులకు అంద కాగలిగిన వాడుగానూ, పరమ స్వతంత్రుడుగానూ రూపొందడం అన్న మాట! అలాంటి వ్యక్తి అడ్డమైన మార్గాల వెంట పరుగులు పెడుతూ అడ్డమైన అనుభవాలూ పొందా లని ఆరాటపడడు. తన లక్ష్యాలు ఏమిటో అతనికి స్పష్టంగా తెలుసు. వాటిని అందుకోడానికి తను చేపట్టవలసిన కచ్చితమైన విధానాలు ఏమిటో తెలుసు. అతనిలో స్థిరమైన విలువలు ఏర్పడుతాయి; అతని ప్రవర్తన నిలకడగా ఉంటుంది.

వ్యక్తిత్వంలో పరిపక్వత సంపాదించడానికి వ్యక్తి కృషి చేయదగిన ముఖ్యమైన రంగం - ఇతరులతో తనకు ఉండే సంబంధాలు. ఇతరులతో మంచి సంబంధాలు ఏర్పరచుకోవా లంటే వ్యక్తి తనను గురించి కాక ఆ ఇతరులను గురించి ఎక్కువగా పట్టించుకుంటూ ఉండాలి. ఇతరులను శ్రద్ధగా పరిశీలిస్తూ వారితో తగిన రీతిని వ్యవహరించడం వల్ల క్రమంగా ఇది అలవా టవుతుంది. సంఘపరమైన ఈ అర్థంలో వ్యక్తికి ఉండే ఒక లక్షణం కాదు వ్యక్తిత్వం; అతని నడవడిక, ప్రవర్తనే అతని వ్యక్తిత్వం. అది ఒక క్రియ; ఆస్తి కాదు. ఒక మనశ్శాస్త్రవేత్త ఆలంకారికంగా అన్నట్టు - "వ్యక్తిత్వం నీరు

## సులభంగా విడాకులు



తమిళనాడులోని శబరి కొండలలోని గ్రామాలలో స్త్రీ విడాకులు పొందడం చాలా తేలిక. విడాకులకు ఒకే షరతు - ఆ దంపతులకు సంతానం లేకుండా ఉండాలి. స్త్రీ తన భర్తకి విడాకు లిచ్చి పరొకరిని వివాహం ఆడా లనుకుంటే కొత్తగా పెళ్ళాడబోయే ప్రియుడు మొదటి భర్తకు అయిన పెళ్ళి ఖర్చులు (సుమారు రు. 1,000 లు) ఇచ్చుకోవాలి-అంతే!

"ఒకరి విశ్వాసాలూ, పద్ధతులూ మనకు ఆమోద యోగ్యం అయినా కాకపోయినా, వాటిని మనం పూర్తిగా గౌరవించాలి!" — మెహర్ బాబా

నిలువ ఉండే గుంటలాంటిది కాదు: నిరంతరం పారే సెల ఏరు లాంటిది."

ఇతరులతో మంచి సంబంధాలు ఉండాలంటే వ్యక్తి తనను గురించి తను మరిచి పోవాలి. ఎప్పుడూ దృష్టి ఇతరుల మీదే లగ్నం చేసి, వాళ్ళకు ఇంకా ఎక్కువ సంతోషం కలిగించడం ఎలాగా అనే ఆలోచిస్తూ ఉండాలి. ఈ ప్రధాన సూత్రం ఆచరణలో పెడితే త్వరలోనే ఆ వ్యక్తి పలుకుబడీ, ప్రజాదరణా పెరుగుతాయి.



వ్యక్తి తన వ్యక్తిత్వానికి పుష్టి చేకూర్చుకోవాలంటే చాలా తెలివిగా దానికి సంఘదృష్టి అలవరచాలి. తన వయస్సుకీ, సంఘంలో తన స్థాయికీ తగిన విధంగా సమూహ కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొంటూ ఉండాలి. 'నేను' అనే మాటను విడిచిపెట్టి 'మీరు' అనే మాటను వాడడం వల్ల సంఘంలో దాగి ఉన్న నిధులు మన వశం అవుతాయి. మన ఉద్వేగాలను మాటలలో కాకుండా చేతల ద్వారా ఇతరులకు తెలియజెయ్యాలి. సంఘజీవి కావాలంటే మొదటి అంశం: ఇతడు అందరికీ కావలసినవాడు అనే భావం కలిగించడం. ఇతరుల విషయంలో సముచిత ప్రవర్తనవల్ల దీనిని సాధించవచ్చును. మనశ్శాస్త్ర పరిభాషలో దీనినే 'సానుభూతి' (empathy) అంటారు.

రెండో అంశం: ముఖంలో హావభావాల ద్వారా ఇతరుల పట్ల మనకున్న ప్రీతిని తెలియజెయ్యడం. కనుబొమ్మలు పైకెత్తడం, నవ్వడం లాంటి చిహ్నాల ద్వారా మన ఆదరాన్ని ప్రకటించవచ్చు.

మూడో అంశం. తన ఆలోచనలకూ, ఆచరణకూ ఒక స్పష్టమైన లక్ష్యం ఉండాలి. అప్పుడే తన వృత్తిలో అతడు ఒక ప్రత్యేక స్థానాన్ని అందుకో గలుగుతాడు. జీవితంలో పైకి వచ్చినవారు తమ నడవడికి అనుగుణమైన వృత్తులనే ఎన్నుకోడం కనిపిస్తుంది.

---

## పాఠకుల అభిప్రాయాలు

(జనవరి 1983)

"పలుకు బడి గలోడి నోట్లో పటిక బెల్లం:
పలుకు బడి లే నోళ్ళం పైకి వెళ్ళం:"

—ఎ.యస్.యస్. శంకరరావు,
విజయవాడ-10.

* * *

" 'నిజాయితీ ప్యాంటూ, 'నమ్రత' షర్టూ తొడుక్కుని
'డిగ్రీ' పై కట్టుకుని నాకో ఉద్యోగం ఇవ్వరూ అంటే
ఎవరిస్తారు - ఈ రోజుల్లో?"

—శ్రీకాకుళపు రామకృష్ణ,
విజయవాడ - 5.

"సహాయపడ గలిగిన హృదయ మున్నవాడికి విమర్శించే హక్కు ఎప్పుడూ ఉంటుంది." —అబ్రహాం లింకన్

ఏదో ఒకటో, రెండో లక్షణాలే మనిషిని గొప్పవాణ్ణి చేయలేవు అని మనశ్శాస్త్రవేత్తలు గుర్తించారు. మనుష్యు లందరిలోనూ ఒకే లక్షణాలు ఉంటాయి. ఆ లక్షణాల పరిమాణాలలో మాత్రమే తేడాలు ఉంటాయి. వంద మంది గొప్పవాళ్ళలోనూ, వందమంది సామాన్యుల లోనూ ఉన్న లక్షణాలను పట్టికలుగా తయారు చేస్తే రెండు పట్టికలలోనూ ఉండే లక్షణాలు ఒకటే! కాని, ఆ లక్షణాల పరిమాణం సామాన్యులలో కంటె మహనీయులలో ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణకు - తెలివి, చొరవ అనే లక్షణాలు సామాన్యులలో కంటె మహనీయులలో చాలా ఎక్కువ ప్రమాణంలో కనిపిస్తాయి. ప్రధానంగా అవసరమైన లక్షణా లన్నీ తగిన విధంగా కలిసినప్పుడే విజయానికి దారి తీస్తాయి.

వ్యక్తిత్వం పెంపొందించుకోవా లనుకునే వారికి ఉపయోగించే కొన్ని సూచనలు:

1. అందరికీ నువ్వంటే ఇష్టమే అని సదా భావించు!

2. వాళ్ళకు ఆసక్తి ఉన్న విషయాలను గురించే వారితో మాట్లాడు!

3. నీ విషయంలోనూ, పరుల విషయంలోనూ, ప్రకృతి విషయంలోనూ వాస్తవాన్ని యథాతథంగా చూడడం అలవరుచుకో!

4. 'నేను' అనే మాట మాని, 'మీరు' అనే మాట ఎక్కువగా వాడడం మొదలుపెట్టు!

5. జీవితంలో పైకి వచ్చిన వారితోనే ఎక్కువగా కలిసి తిరుగుతూ ఉండు! క్రొత్త సంగతులు తెలుసుకోడానికి మనుష్యులతో అనుబంధం అవసరం.

అయితే - ఎన్ని చెప్పినా ప్రయత్న పూర్వకంగా ఎవ్వరూ ఆకర్షణీయమైన వ్యక్తిత్వాన్ని రూపొందించుకోలేరు. ఆనందం లాగే పరిణతి పొందిన వ్యక్తిత్వం కూడా 'బై - ప్రోడక్ట్' గానే లభిస్తుంది. సుప్రసిద్ధ అమెరికన్ నవలా రచయిత హాథారన్ అంటాడు: "ఈ ప్రపంచంలో ఆనందం అనుకోకుండానే లభిస్తుంది. దాని కోసం అర్రులు సాచడం ప్రారంభిస్తే అది ఎండమావుల వెంట పరుగులు పెట్టినట్టే అవుతుంది."

(కడప రేడియో కేంద్రం సౌజన్యంతో)

## మొట్టమొదటి అంతర్జాతీయ కృత్రిమ ఉపగ్రహం



'ఏరియల్' అనబడే ప్రపంచంలోని మొట్టమొదటి అంతర్జాతీయ కృత్రిమ ఉపగ్రహాన్ని 1962 ఏప్రిల్ 26 న అమెరికా దేశం భూమి కక్ష్యలోకి పంపింది. ఆ అంతరిక్ష నౌకను అమెరికాలో నిర్మించినా, దాని లోని ప్రయోగ పరికరాలను బ్రిటన్ సృష్టి చేసింది.

"మానవుడు జీవితంలో ముందడుగు వేయడానికి తోడ్పడే అంశాలు రెండు: ఒకటి - భయం: రెండు - శ్రద్ధ!" — నెపోలియన్

# యోగాసనాలు

వ్యాయామ విద్యా ప్రవీణ శ్రీ జి. శ్రీనివాసరావు

## 3

### 4. పశ్చిమోత్తానాసనం:

వెల్లకిలా పడుకుని చేతులు చెవుల ప్రక్కగా వెనుకకు సాచాలి. కండరాలు బిగబట్టి గట్టిగా ఒకసారి గాలి లోపలికి పీలవాలి. మెల్లగా తలా, మొండెం పైకి లేపాలి. తరువాత ముందుకు వంగి తల మోకాళ్ళకు




PACHIMOTTANA-ASANA




PACHIMOTTANA-ASANA

ఆనించి చేతి వేళ్ళతో బొటనవేళ్ళు పట్టుకోవాలి. మోచేతులు నేలకు తగులుతూ ఉండాలి.

వ్యవధి: 6 మొదలు 30 సెకనులు.

ప్రయోజనాలు: ఈ ఆసనం ఆకలిని పెంచుతుంది. రక్తాన్ని పరిశుభ్రం చేస్తుంది. మూర్ఛవ్యాధి నివారణకు తోడ్పడుతుంది. మలబద్ధకం, మూలశంక, మధుమేహం

---

## రాత్రిని పగలుగా మార్చవచ్చా?

"చంద్రగోళం మీద అద్దాలు అమర్చి సూర్యుని కిరణాలు భూమి మీదికి ప్రతిఫలింపచేయడం ద్వారా రాత్రులు విద్యుచ్ఛక్తి వాడకాన్ని పొదుపు చేసుకోవచ్చును" అన్నారు డా. క్రిస్టియన్ మార్చెల్ అనే ఒక ఫ్రెంచ్ శాస్త్రజ్ఞుడు - ఇటీవల రోమ్‌లో జరిగిన 'అంతర్జాతీయ అంతరిక్షయాన మహాసభ' ప్రతినిధులను ఉద్దేశించి ప్రసంగిస్తూ. ఆయన పథకం ప్రకారం చంద్రుడి నుంచి ఆ విధంగా ప్రతిఫలించే కాంతిలో పుస్తకాలు చదువుకోవచ్చు; పొలం పనులూ, భవన నిర్మాణాది కార్యక్రమాలూ మామూలుగా కొనసాగించవచ్చు. చంద్రునిపై అమర్చిన ఒక చదరపు మీటరు అద్దం భూమిమీద 3,200 మొదలు 3,800 చ.కి.మీ.ల ప్రాంతానికి వెలుతురు ప్రసాదించగలదు.

"కార్య భీరుత పురుష లక్షణం కాదు!" —శ్రీ వీరేశలింగం పంతులు

వ్యాధులను నయం చేస్తుంది. వెన్నుపాము సాగుతూ ఎత్తు ఎదగడానికి కూడా ఈ ఆసనం సహాయం చేస్తుంది.

5. హలాసనం:

వెల్లకిలా పడుకుని చేతులు శరీరం ఇరు ప్రక్కలా సాచి ఉంచాలి. మెల్లగా కాళ్లూ,




*HALASANA*

నడుం, మొండెం పైకి లేపి చిత్రంలో చూపిన విధంగా కాలి బొటన వ్రేళ్ళు తల వెనుకగా నేలను తాకేట్టు చేయాలి. మోకాళ్ళు ముడువ కూడదు. గడ్డం రొమ్ముకి ఆనుతూ ఉండాలి. తరువాత మెల్లగా కాళ్ళను పైకెత్తి మళ్ళీ మొట్ట మొదటి స్థితికి తేవాలి.

వ్యవధి: 6 మొదలు 60 సెకనులు.

ప్రయోజనాలు: పొత్తికడుపులోని కొవ్వును కరగిస్తుంది. మలబద్ధకం, లివరు గాని, స్ప్లీన్‌గాని పెద్దవి కావడం వంటి వ్యాధుల నివారణకూ, నడుము నొప్పి (lumbago) వంటి ఎన్నో నరాల జబ్బుల నివారణకూ ఈ ఆసనం తోడ్పడుతుంది. దీనివల్ల వెన్నుపాము సాగుతూ లైంగిక గ్రంథులు బలపడడానికి కూడా ఇది దోహదం చేస్తుంది. (సశేషం)

## మిక్కిలి పెద్ద నూనె బావి

ప్రపంచంలో మిక్కిలి పెద్ద నూనె బావి సౌదీ అరేబియాలోని ఘవార్ బావి. 150 × 22 మైళ్ళ విస్తీర్ణం గల బావి ఇది.

(26 వ పేజీ తరువాయి)

విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల రెండు యూనిట్‌లు ఉంటాయి.

* * *

## రాతి యుగం నాటి పెయింటింగులు:

భోపాల్ (మధ్యప్రదేశ్) సమీపంలో హోషింగాబాద్ కళాశాల సైన్సు విద్యార్థి అబ్దుల్ సలీమ్ ఎరుపు, తెలుపు రంగులతో గుహలలో చిత్రించబడిన 100 పెయింటింగులు కనుగొన్నారు. వేట దృశ్యాలనూ, అడవి జంతువులనూ చిత్రించిన ఈ పెయింటింగులు రాతియుగానికీ, రాగి యుగానికీ చెందినవిగా భావించబడుతున్నాయి.

* * *

## 4 కొత్త సూపర్ థెర్మల్ స్టేషన్‌లు:

నేషనల్ థెర్మల్ పవర్ కార్పొరేషన్ వారు సింగ్రౌలీ(ఉ.ప్ర. - 2,000 మెగావాట్లు), కోర్బా (మ.ప్ర. - 2,100 మెగావాట్లు), రామగుండం (ఆం.ప్ర. - 2,100 మెగావాట్లు), ఫరక్కా (ప.బెంగాల్ - 600 మెగావాట్లు) లలో కొత్తగా 4 సూపర్ థెర్మల్ స్టేషన్‌లు నిర్మిస్తున్నారు. ●

"ఓర్పు చేగటుగా ఉంటుంది; కాని దాని ఫలితం అమృతం!" —రాన్ సెన్

# భూ ప్రదక్షిణం

## 'అర్ధరాత్రి సూర్యుడు కనిపించే దేశం'

# స్వీడెన్

శ్రీ సి. రామకృష్ణ శాస్త్రి

యూరప్ ఉత్తర భాగాన స్కాండినేవియా ద్వీపకల్పంలో ఉన్న దేశాలలో ఒకటి స్వీడెన్. 'అర్ధరాత్రి సూర్యుడు కనిపించే దేశం' అని ఈ దేశానికి ప్రసిద్ధి. ఆర్కిటిక్ వలయంలో ఉన్న స్వీడెన్ ఉత్తర భాగంలో వేసవి నెలలలో అర్ధరాత్రి దాకా సూర్యుడు ప్రకాశిస్తూ ఉండడం వల్ల ఈ ప్రసిద్ధి ఏర్పడింది.




క్రీడలలో ఆసక్తి ఉన్నవారికి ప్రపంచ వింబుల్డన్ టెన్నిస్ ఛాంపియన్ బ్జోర్న్ బోర్గ్ జన్మస్థానంగా స్వీడెన్ గుర్తుంటుంది. కాని, చాలా మందికి తెలియని విషయం: యూరప్‌లో పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలలో స్వీడెన్ ఒకటి.

1,73,666 చ. మైళ్ళు (4,49,795 చ కి.మీ. లు) విస్తీర్ణం గల దేశం స్వీడెన్. ఇక్కడి జనాభా 83 లక్షలలో ఇంచుమించు ముప్పాతిక మంది నగరాలలో జీవిస్తున్నారు. జనాభా సాంద్రత మిక్కిలి తక్కువ ఉన్న దేశాలలో స్వీడెన్ ఒకటి. ఇక్కడ చ. మై. కి 52 మంది మాత్రమే జనం ఉన్నారు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ శాంతి నెలకొని ఉన్న స్వీడెన్‌లో ప్రజల జీవన ప్రమాణం చాలా ఎక్కువ.

## మొదటి మహిళా ప్రధాని

ప్రపంచంలో మొట్టమొదటిసారిగా ఒక దేశానికి ప్రధాన మంత్రి అయిన మహిళ శ్రీమతి సిరిమావో బండారునాయకే. 1960-65 మధ్యా, 1970-77 మధ్యా ఆమె శ్రీలంకకు ప్రధానిగా ఉన్నారు.

---

"నిత్య శంకితులు ఏదీ సాధించలేరు." ఎడ్మండ్ బర్క్

ఈ దేశ సౌభాగ్యానికి ప్రధానంగా రెండు కారణాలు కనిపిస్తాయి: ఒకటి - జనాభా తక్కువ స్థాయిలో ఉండడం. రెండు - ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో నిమగ్నం కాకపోవడంవల్ల అభివృద్ధి సాధించే అవకాశాలు ఈ దేశానికి ఎక్కువగా లభించడం.

తగినన్ని ప్రకృతి వనరులు స్వీడెన్‌కి ఉన్నాయి. సుదీర్ఘమైన తీరప్రాంతం ఉండడం వల్ల చేపలు పట్టడం, నౌకా నిర్మాణం ఇక్కడి ప్రధాన వృత్తులు. స్వీడెన్‌లో కనిపించే



స్టాక్‌హోమ్ టౌను హాలు

ఇతర ప్రముఖ పరిశ్రమలు అడవుల పెంపకం, కలప, గనుల త్రవ్వకం, లోహశుద్ధి (metallurgy), రాసాయనిక పరిశ్రమ, కార్ల ఉత్పత్తి, ఆహార పదార్థాలను నిలువ చేసే పరిశ్రమ, విద్యుత్పరికరాల ఉత్పత్తి. ఈ దేశ పారిశ్రామికాభివృద్ధికి ప్రధాన కారణం - ఇక్కడ విద్యుచ్ఛక్తి పుష్కలంగా లభిస్తూ ఉండడం. మొత్తం విద్యుచ్ఛక్తిలో 65 శాతం పడమర నుంచి తూర్పుకి ప్రవహించే ఇక్కడి నదుల నుంచి వచ్చే జల విద్యుచ్ఛక్తి. విద్యుచ్ఛక్తి వాడకం ఈ దేశంలో తల ఒకటికి సంవత్సరానికి 50,000 యూనిట్లు. ఏసియా (ASEA), వల్కాన్ - లావల్, సాండ్విక్, వోల్వో, ఎస్.కె.ఎఫ్, ఎల్.ఎమ్. ఎరిక్‌సన్, అట్లాస్ కాప్కో వంటి ఇక్కడి నానా జాతి వాణిజ్య సంస్థలలో స్వీడిష్ వారిదే పైచేయి. పరిశ్రమలలో 90 శాతం ప్రజా రంగంలోనే ఉన్నాయి.

స్వీడెన్ దేశ ప్రభుత్వ అధినేత ఆరవ గుస్తావ్ రాజా. 1950 లో ఈయన సింహాసనం ఎక్కారు. ఈ దేశం పార్లమెంటులో 1970 దాకా రెండు సభలు ఉంటూ వచ్చినా, అటు తరువాత 350 మంది ఎన్నికయ్యే సభ్యులతో కూడిన ఒకే సభ గల పార్లమెంటు వెలసింది. పార్లమెంటులో అధిక సంఖ్యాక పక్షానికి నాయకుడు ప్రధాని అవుతారు. ఈ దేశంలో 5 ప్రధాన రాజకీయ పక్షాలు

---

## పెత్తందారు - నాయకుడు

పెత్తందారు పరుగులు పెట్టిస్తాడు: నాయకుడు శిక్షణ ఇస్తాడు. పెత్తందారుని చూస్తే భయం: నాయకుణ్ణి చూస్తే ఉత్సాహం: పెత్తందారు 'నేను' అంటాడు: నాయకుడు 'మనం' అంటాడు. పెత్తందారు అందరూ 'టైముకి రావాలి' అంటాడు: నాయకుడు టైమ్ కాకముందే తాను వచ్చి కూచుంటాడు. పెత్తందారు పని అంటే విసుగు పుట్టిస్తాడు: నాయకుడు పనిని క్రీడగా మారుస్తాడు.

"ఇష్టం లేని వ్యక్తుల్ని గూర్చిన ఆలోచనలతో నిమిషం కూడా వృథా చేయవద్దు!" —ఆరీలియస్

ఉన్నాయి. వాటిలో 'సోషల్ డెమాక్రాట్స్'దే సాధారణంగా పైచేయి. మధ్యలో కొద్ది కాలం తప్ప 1932 మొదలు ఇప్పటిదాకా ఆ పక్షమే అధికారంలో ఉంది. స్థానిక స్వపరిపాలన సంస్థలు కూడా సాధారణంగా ప్రభుత్వ పక్షం అధీనంలోనే ఉంటాయి.

'సోషల్ డెమొక్రాట్స్' పక్షం హయాములో స్వీడెన్ పిల్లలకూ, కుటుంబాలకూ అలవెన్స్‌లు, తప్పనిసరి సెలవలు, ఉచిత వైద్య సదుపాయం. అధిక విశ్రాంతి వేతనాలు, నిరుద్యోగ భృతి మొదలైన సౌకర్యాలతో కూడిన ఆదర్శప్రాయమైన సంక్షేమ రాజ్యంగా రూపొందింది.



స్టాక్ హోమ్ సిటీస్క్వేర్

7 మొదలు 16 సం. ల దాకా విద్యార్థులకు 9 ఏళ్ళ పాటు 'సమగ్ర విద్యా విధానం' (comprehensive school) లో చదువు నిర్బంధంగా బోధిస్తారు. ఈ విద్యాకాలంలో 3 విభాగాలు: 1 - 3 తరగతులు ప్రాథమిక లేదా జూనియర్ విద్య: 4 - 6 తరగతులు ఉన్నత ప్రాథమిక లేదా మాధ్యమిక విద్య: 7 - 9 తరగతులు లోయర్ సెకండరీ లేదా సీనియర్ విద్య. ఈ నిర్బంధ విద్య అనంతరం 16-19 ఏళ్ళ దాకా విద్యార్థులు 'ఇంటిగ్రేటెడ్ అప్పర్ సెకండరీ స్కూల్'లో 22 వృత్తి విద్యలలో ఏదో కొన్నిటిలో శిక్షణ పొందుతారు. నిర్బంధ విద్య అభ్యసించిన వారిలో దాదాపు 90 శాతం అప్పర్ సెకండరీ స్కూల్‌లో చేరుతారు. అక్కడ 2 ఏళ్ళు చదివితే యూనివర్సిటీలలో ఉన్నత విద్య చదివే అర్హత వస్తుంది. 20 నగరాలలో ప్రభుత్వం నడిపే 30 సంస్థలలో సుమారు 1,60,000 మంది ఉన్నత విద్య అభ్యసిస్తున్నారు. వీటిలో 7 కేంద్రాలు మాత్రమే రీసెర్చికి కేటాయించబడినాయి: స్టాక్‌హోమ్, గోతెన్ బర్గ్, మాల్మో, ఉప్సాలా, లింకోపింగ్, యూమియా, లూలియా. దాదాపు 10,000 మంది డాక్టర్ పట్టం కోసం వీటిలో పరిశోధనలు సాగిస్తూ ఉంటారు. వైద్య శిక్షణకు 5½ ఏళ్ళ కోర్సు, నర్సుల శిక్షణకూ,

## శ్వాసకోశ వ్యాధుల పెరుగుదలకు కారణం

భూమి వాతావరణంలో సల్ఫర్ డయాక్సైడ్, కార్బన్ మోనాక్సైడ్ ఎక్కువ కావడమే శ్వాసకోశ వ్యాధుల పెరుగుదలకు కారణం అంటున్నారు. 1952 లో లండన్ మీద ముసిరిన ఒక పొగ మబ్బు వల్ల శ్వాసకోశ వ్యాధులు వచ్చి దాదాపు 5,000 మంది చనిపోయారట.

"తప్పు చేశానని ఒప్పుకోడానికి సిగ్గుపడ నవసరం లేదు:
మనిషి నిన్నటి కంటె నేడు మరింత వివేకవంతు డవుతాడు." —పోప్

ఉపాధ్యాయ శిక్షణకూ 2½ ఏళ్ళ కోర్సులూ ఉన్నాయి.

'జానపద ఉన్నత పాఠశాలల'లో వయో జన విద్యాబోధన జరుగుతూంది. వీటిలో 15,000 మంది వయోజనులు (18 ఏళ్ళు పైబడినవారు) 16 వారాల కోర్సులు చదువుతూ ఉంటారు. ఇవి కాక సుమారు 1,00,000 మంది వయోజనులకు ఉత్పాదక శిక్షణ విచ్చే 'లేబర్ మార్కెట్ ట్రెయినింగ్ ప్రోగ్రామ్'లు ఉన్నాయి. అక్కడ శిక్షణ పొందితే స్కాండినేవియా ద్వీపకల్పంలోని దేశాలలో (నార్వే, స్వీడెన్, డెన్మార్క్, ఫిన్లండ్‌లలో) ఎక్కడ అయినా వారికి పని దొరుకుతుంది.

రాజకీయ సుస్థిరతవల్ల స్వీడెన్‌లో లేబర్ సమస్యలు తక్కువ. వివాదాలు వస్తే కార్మిక వర్గాలు సంప్రదింపుల ద్వారా సమస్యలు పరిష్కరించుకుంటాయే తప్ప సాధారణంగా సమ్మెలకు దిగవు.

దిగువ వర్గాల వారికి కూడా దేశ సౌభాగ్యం అందుబాటులో ఉన్న సంక్షేమ రాజ్యం స్వీడెన్. ఇక్కడ రిటైర్‌మెంటు వయస్సు 65 సం. లు.

ఈ దేశంలో ప్రధానమైన క్రీడలు: ఈత కొట్టడం, స్కీయింగు. 5 ఏళ్ళు పైబడిన ప్రతి బాలునికీ, ప్రతి బాలికకూ స్కీయింగ్ వచ్చి తీరుతుంది.

స్వీడెన్ రాజధాని నగరం స్టాక్‌హోమ్. 10 లక్షల జనాభాతో సర్వ ఆధునిక సౌకర్యాలూ గల ఈ నగరంలో బస్సు, భూగర్భ రైల్వే సర్వీసులు సమర్థంగా పనిచేస్తున్నాయి. ఈ నగరంలో కొంత భాగం అనేక దీవుల మీద విస్తరించి ఉంది. అందమైన భవనాలతో, ఉద్యాన వనాలతో, మ్యూజియమ్‌లతో కూడిన ఈ నగరం టూరిస్టుల పాలిటి స్వర్గధామంగా భావించబడుతూంది. ఇక్కడ టౌన్ హాలులోనే ప్రతి ఏడూ నోబెల్ బహుమతులు ఇచ్చే ఉత్సవం జరుగుతుంది. డైనమైట్ కనిపెట్టిన ఆల్ఫ్రెడ్ నోబెల్ అనే స్వీడిష్ శాస్త్రవేత్త నోబెల్ బహుమతుల వ్యవస్థ ఏర్పరిచాడు. సుప్రసిద్ధులైన ఔగస్ట్ స్ట్రిండ్‌బెర్గ్ వంటి నాటక రచయితలూ, డీట్రిష్ బక్స్‌టెహ్యూడ్ వంటి సంగీత రచయితలూ, జెన్నీ లిండ్, బిర్గిట్ నిల్సన్ వంటి గాయకులూ స్వీడిష్ జాతీయులే। 1953 నుంచి 1961 దాకా ఐక్యరాజ్య సమితి సెక్రటరీ జనరల్‌గా ఉన్న డాగ్ హామర్‌షీల్డ్ కూడా స్వీడిష్ జాతీయుడే। ●

## మిక్కిలి పెద్ద కీటకం



బోర్నియోలోని 'కర్రపురుగు' (The stick insect) ప్రపంచంలోని కీటకాలన్నిటిలోనూ మిక్కిలి పెద్దది. దాని పొడవు 13 అం. లు.

# బహుమతి పొందిన వ్యాసం

(డిసెంబరు 1982)

## నిజాయితీ అం

ఆర్. జయ కుమార్, చిత్తూరు.

నిజాయితీ మనిషికి గుండెకాయ లాంటిది. నిజాయితీ ఉన్నంత కాలమే మనిషి జీవితంలో సంస్కృతి స్పందిస్తుంది. మహాత్మా గాంధి తన నిజాయితీ ద్వారా భారత దేశానికి ప్రపంచ దేశాలలో నభ్యతా గౌరవం కలిగించాడు. ఆయన ఏది చేసినా, ఏది చెప్పినా రెంటికీ పొంతన ఉండేది. అందుకే ఆయన భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించి, 'జాతి పిత' అయ్యాడు. అబ్రహాం లింకన్ నిజాయితీ నీగ్రోలను బానిసత్వం చెరనుంచి విడుదల చేసింది. మోసెస్ నిజాయితీ తన ప్రజలకు విముక్తిని ప్రసాదించింది. లెనిన్ నిజాయితీ రష్యా ప్రజలకు నూతన జీవితాన్ని ప్రసాదించింది. ఇలా ఎందరో మహనీయులు నిజాయితీ ద్వారా మానవాళికి మేలు చేకూర్చారు.

ద్రవ్యానికి విలువ కలిగించేది బంగారం. నత్తు రూపాయి అయితే చెల్లుబడి కాదు. పైగా ప్రజలను మోసగించినట్లవుతుంది. ప్రజలు అతనికి మోసగాడని ముద్ర వేస్తారు. నిజాయితీపరుడికి సంఘంలో కీర్తి లభి

### జంతువులు ప్రదర్శించే నాటకం



జంతువులు ప్రదర్శించే నాటకాలు ఆడేందుకు 500 సీట్లతో కూడిన ఒక నాటక శాల మొట్టమొదటిసారిగా మాస్కోలో వెలసింది. ఆ నాటక సమాజంలో సుమారు 300 జంతువులు-పిల్లులు, కుక్కలు, నక్కలు, తోడేళ్లు, మేకలు, కోడి పుంజులు, పెలికన్ పక్షులు, కోతులు మొదలైనవి - ఉన్నాయి. పంచతంత్ర కథలలాంటి పుక్కిటి పురాణ గాథల లోని దృశ్యాలను ఆ జంతువులు ప్రదర్శిసాయి.

"మనుష్యులు తప్పులు చేస్తున్నందుకు నేనాశ్చర్యపడను;
అందుకు వారు సిగ్గుపడకపోవడమే నాకు ఆశ్చర్యం కలిగిస్తుంది." —స్విఫ్ట్

మంది. ఒక కుండెడు పాలలో ఒక్క చుక్క విషం వర్షా అది ఎందుకూ పనికిరాదు. చీటికి ప్రాణంప్రాణం, మనిషి మాటలకు ప్రాణం నీతి, నిజాయితీ! ఒకే మాట, ఒకే బాణం అని పేరెన్నిక గన్నాడు రాముడు. అదీ అతని నిజాయితీ!

ఫాహియాన్ తన రచనలలో - గుప్తుల కాలం నాడు రాచబాటపై పడి ఉన్న రత్న హారాన్ని ఎవ్వరూ ముట్టేవారు కారని వ్రాశాడు. ఆ నాటి ప్రజల నిజాయితీకి అది ఒక నిదర్శనం. నేడు ప్రజలలో నిజాయితీ కొరవడింది. శ్రమపడే వ్యక్తికి సంఘంలో విలువ లేకుండా పోతున్నది. అందుకే మన సమాజంలో అశాంతి, అలజడీ వ్యాపించాయి. మనిషి నిజాయితీగా బ్రతికినప్పుడే మానవ సమాజానికి వెలుగు బాట ఏర్పడుతుంది. ఒక చిన్న దీపం తన చుట్టూ ఉన్న చీకటిని పోగొట్టినట్టు మనిషిలో వెలిగే నిజాయితీ అతని చుట్టూ ఉన్న వాతావరణాన్ని పునీతం చేస్తుంది. తీయని జీవితానికి ఆటపట్టు నిజాయితీ!

* * *

ప్రతాప్ కిష్టయ్య, లింగన్నపేట.

నిజాయితీ అంటే సత్ప్రవర్తన. మనో వాక్కాయ కర్మలా ఇతరులను మితిమీరిన తన స్వార్థంతో బాధించకుండా ఉండడమే నిజాయితీ. వ్యక్తికంటె కుటుంబం, కుటుంబం కంటె దేశం, దేశం కంటె మానవ జాతి గొప్పని అనే ఆలోచన మానవ జాతి పురోగతికి దోహదం చేయగలదు.

దేశ కాల పాత్రానుగుణంగా లోకం మారుతూ ఉంటుంది. అంత మాత్రాన అనర్థాన్ని ఆదరించవలసిన అవసరం లేదు. ఆదర్శ సమాజ స్థాపనకై ఉన్నతాశయా

## మాలిన్యాలను హరించే అంతర తామర



చెరువులు మొదలైన జలాశయాలలో విరివిగా కనిపించే అంతర తామర (water hyacinth) వల్ల కొన్ని ఉపయోగాలు కూడా లేకపోలేదు. నీటిలో ఉండే మాలిన్యాలతో ఇది పెరుగుతూ ఉండడం వల్ల నీటిని ఇది శుభ్రం చేస్తుంది. దీనిని పైరుగా పెంచితే జీవ సంబంధమైన ఇంధన వాయువు (bio - gas), ఎరువులు, కోళ్ళ మేత మొదలైనవి దీని నుండి లభిస్తాయి. మెక్సికోలో జరిగిన పరిశోధనలవల్ల దీని నుంచి ఒక పిండి తయారు చేసే ప్రక్రియను కనుగొన్నారు. పుష్టికరమైన ఈ పిండిని పశువులకు ఆహారంగా వాడవచ్చునంటున్నారు.

"పరులను జయించినవాడు బలవంతుడు;
తన్ను తాను జయించినవాడు శక్తిమంతుడు." —లావో త్జూ

లతో, నిజాయితీతో వ్యక్తులు వ్యవహరిం చాలి. అప్పుడే సమాజంలో శాంతి నెల కొంటుంది. ధర్మాన్ని మనం రక్షిస్తే ధర్మం మనల్ని రక్షిస్తుంది.

ఇహ పరాలు సాధించడ మంటే మన జీవి తాలను చక్కగా సరిదిద్దుకోడం. భావి తరా లకు మార్గదర్శకులమై మెలగడమే నిజంగా పరాన్ని సాధించడం. అంతే కాని, స్వార్థంతో స్వర్గప్రాప్తి కోసం ఆరాటపడడం కాదు.

నేడు మన సమాజంలో ప్రతి రంగం లోనూ ధనం, పలుకుబడీ ప్రాబల్యం వహించి నిజాయితీకి నిలువ నీడ లేకుండా పోతూంది. అవినీతి, లంచగొండితనం విచ్చలవిడిగా విహరిస్తున్నాయి. ఈ దుస్థితి నుంచి మన జాతి జాగృతమై పురోగమించా లంటే మన మంతా నిజాయితీతో నిర్భయంగా వ్యవహరించడం ఎంతైనా అవసరం.

* * *

పి. ఆర్. మండేశ్వర రావు, రాజమండ్రి

ఉద్యోగంలో లంచం తీసుకోకపోవడం ఒక్కటే నిజాయితీ కాదు. అద్దెకు 'విన్ డమ్' పుస్తకం తీసుకుని 'కూపను' చించ కుండా తిరిగి ఇవ్వడం కూడా నిజాయితీయే! లంచం ఇవ్వకుండా ఉద్యోగం సంపాదిం చడం నుంచి బ్లాకులో టిక్కట్లు కొనకుండా సినిమా చూడడం దాకా ఎన్నయినా నిజాయి తీకి చెప్పవచ్చు ఉదాహరణలు!

సామాజిక కట్టుబాట్లను అతిక్రమించక పోవడం, నైతిక విలువలను పాటించడం,

## రష్యా 'సోవియెట్ యూనియన్' ఎలా అయింది?



V.I. LENIN

రష్యన్ భాషలో 'సోవియట్' అంటే సంఘం (council) అని అర్థం. 1905లో రష్యాలో జరిగిన సాధారణ సమ్మెలో వివిధ ఫాక్టరీల నుంచి వచ్చిన డెలిగేట్లు 'సోవియెట్ లు'గా సమావేశాలు జరుపుతూ వచ్చారు. 1917 నాటి విప్లవంలో కూడా అదే విధానం అనుసరించారు. కొన్నేళ్ళ పాటు తాత్కాలిక ప్రభుత్వాలను కూడా ఆ 'సోవియట్'లే నడి పాయి. చివరికి ఆ 'సోవియెట్' లన్నీ బోల్షివిక్‌ల అధీనంలోకి వచ్చాయి. వ్లాడిమిర్ లెనిన్ అటు తరువాత ఆ 'సోవియెట్' లనే స్థానిక, కేంద్ర పాలక సంఘాలుగా మార్చారు.

"వెలుగుతున్న దీపమే ఇతర దీపాలను వెలిగించ గలదు;
నేర్చుకున్న వారే ఇతరులకు నేర్పగలరు." —విశ్వకవి రవీంద్రుడు

ఆత్మవంచన చేసుకోకుండా జీవించడం కూడా నిజాయితీ క్రిందికే వస్తాయి.

విద్యాలయాలలో తనయులు పరీక్షలు వ్రాస్తుంటే స్లిప్‌లు అందించే తండ్రులు కొందరు. ఆఫీసులో లంచం, తీసుకోమని భర్తలను ప్రోత్సహించే భార్యలు కొందరు. ఇక - సోషలిజమ్ గురించి గంటల తరబడి ఉపన్యాసా లిచ్చే రాజకీయ నాయకులు అక్రమంగా ధనం ఆర్జించడం కోసం లాటరీలను నడుపుతూ సగటు మనిషి బలహీనతల మీద వ్యాపారం చేస్తున్నారు.

ఒక పార్టీ టిక్కెట్టు మీద ఎన్నికలలో గెలుపొంది ఆ పర్నాడే పదవి కోసం వేరొక పార్టీలోకి ఉరికే రాజకీయ నాయకులలో నిజాయితీ లోపిస్తుంది. ప్రజలకు సందేశాలను ఇచ్చే అర్హతను వారు కోల్పోతున్నారు.

నీతి, నిజాయితీలు తనకు కూడు పెట్టడం లేదని కాని, అవి తనను కష్టాలపాలు చేస్తున్నాయని గాని నిజమైన నిజాయితీపరుడు బెంగపడడు. జీవితంతో అతడు ఎన్నడూ రాజీపడడు. మనిషికి నిజమైన ఆస్తి అతని నిజాయితీయే! నిజాయితీ గలవాడు పేదవాడైనా మట్టిలో ఉన్న మాణిక్యంలా అతడు రాణిస్తాడు.

అనాదిగా నీతి, అవినీతుల మధ్య సంఘర్షణ జరుగుతూనే వస్తూంది. కాని ఎప్పుడూ అంతిమ విజయం నీతి, నిజాయితీలదే! సృష్టి ఉన్నంతవరకూ 'నిజాయితీ' ఉదయభానునిలా ప్రకాశిస్తూనే ఉంటుంది. ●

## మెల్లగా పరుగులు చెయ్యడంలో రికార్డు

1972-73 సీజన్‌లో ఇండియా, ఇంగ్లండ్‌ల మధ్య జరిగిన బొంబాయి క్రికెట్ టెస్టులో మన్సూర్ అలీఖాన్ పటౌడీ 102 నిమిషాలు బాట్ చేసి 5 పరుగులు సాధించాడు. మెల్లగా పరుగులు చెయ్యడంలో ఇప్పటికీ అదే రికార్డు!

## ఎక్కువ కాలం జీవించాలంటే?



"కష్టపడి పనిచెయ్యి! సంతృప్తితో ఎప్పుడూ సంతోషంగా ఉండు! వీలైనంత ఎక్కువ కాలం ఆరు బయట గడుపు!"

డా॥ మోక్షగుండం విశ్వేశ్వరయ్య, (1960 అక్టోబరులో జరిగిన శతవర్ష జయంతి సందర్భంలో).

" 'కోపం' తేనెపట్టు మీదికి విసిరిన రాయి లాంటిది!" —మలబార్ సామెత

# పోటీలు

మార్చి 1983

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకి తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలలో లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10లు, రు. 7లు, రు. 5లు ఖరీదు చేసే పుస్తకాలు బహూమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపను' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపనుతో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మార్చి 20, 1983. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9 దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

"జాతీయ సమైక్యం - వార్తా పత్రికలు" అనే అంశం మీద 300 మాటలు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## అదృష్ట పాఠకుడు

(జనవరి 1983)



కటికాల కృష్ణమూర్తి, బి.ఏ., s/o కె. చలపయ్య, ఇంటి నెం 9-81, పూర్ణ సింగ్ లేన్, రాజవీధి, వెంకటగిరి టౌన్ - 524 132 (నెల్లూరు జిల్లా). హాబీలు: పుస్తక పఠనం, రేడియో కార్యక్రమాలు వినడం, నూతన విషయాలపై ఆసక్తి.

" 'నాది నీది: నీది నీది' అనేవాడు దేవత:
'నీది నాది: నాది నాది' అనేవాడు రాక్షసుడు!"

—టాల్ముడ్

## క్విజ్

1. 'జై జవాన్, జై కిసాన్' అనే వినాదం ఇచ్చిన భారత నేత ఎవరు? 2. ఎన్నేళ్ళు నిండితే 'సప్తతి పూర్తి ఉత్సవం' చేస్తారు? 3. ద. కొరియా రాజధాని ఏది? 4. ఇండియా మొదటి అణు పరీక్ష ఎక్కడ జరిగింది? 5. అంతరిక్ష యాత్రికులు ఏ విషయమై పరిశోధనలు చేస్తారు? 6. కుటుంబ నియంత్రణ ఉద్యమం చిహ్నం ఏది? 7. 'పెగటు' అనే మాట ఏ ఆటలో వాడుతారు? 8. తోకచుక్క స్వరూపం ఏమిటి? 9. ఏక కాలంలో జీవిస్తూ ఉన్న వారిని ఏమంటారు? 10. 'పిచ్' అనే మాటను ఏ ఆటలో ఉపయోగిసారు?

## పజిల్

ఆధారాలు : అడ్డం 1. భారతీయులు పారాయణ చేసే ఉద్ గ్రంథం, 3. 'మరచి పోయాను' — వ్యవహారంలో. 6 పడవ దేనితో నడుస్తుంది? 7. రక్తనాళాలు, 10. స్వప్నము, 11. మన్మథుని భార్య చెవికమ్మ, 12. సర్పము, 13. 'తెగు'కి క్త్వార్థకం, 15. 'మీతో'కి ఏకవచనం, 16. పులుల తల కోసేస్తే? 17. శాంతి చిహ్నం, 21. లక్ష్యం, 22. వరిగడ్డితో పేనిన మోకు, 24. శుక్రాచార్యుల కూతురు, 26. 'శివా!' పర్యాయ పదం, 27. బ్రదికి ఉండగానే ముక్తి పొందిన వారు.

నిలువు: 1. ఖర్చుకి వ్యతిరేక పదం, 2. గౌతమ బుద్ధుని భార్య, 3. యంత్రం, 4. 'సీచా పాకర' (గజిబిజి), 5. చపల బుద్ధితో. 6. దేశభాషలందు ఏది లెస్స?, 8. బుద్ధి తల్లకిందులైనా 'పోను', 13. ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రభుత్వం ఏర్పరచిన పార్టీ, 14. 'వరి గిలక' (గజిబిజి), 17. పవనుని కుమారుడు - ఆంజనేయుడు, 18. హత్య చేస్తే ఏమిటి శిక్ష?, 19. 'రజనీ మోహన్' కి

---

## రష్యాలోని 'బైకాల్' సరస్సు విశేషం




రష్యాలోని సుప్రసిద్ధమైన బైకాల్ సరస్సు పొడవు 600 కి.మీ.లు: వెడల్పు 50 కి. మీ.లు, లోతు 1,620 మీటర్లు. ఈ సరస్సులో 23,000 ఘ. కి.మీటర్ల స్వచ్ఛమైన నీరు ఉంది. అయితే అది ఉప్పు నీరు. ఈ సరస్సులోని విశేషం: దీనిలో ఉన్న 1,300 జాతుల జల జంతువులలో ముప్పాతిక భాగం ప్రపంచంలో మరెక్కడా కనిపించవు!

("స్పుట్నిక్" సౌజన్యంతో)

"నీ బాధ్యతల నుంచి నీవు తప్పించుకోకు!" — మెహర్ బాబా



సంక్షిప్త నామం, 20. అద్దము, 23. ప్రహ్లాద, నారదాదులు, 25. 'యామినీ రాగిణి' సంక్షిప్త నామం.

## తెలివికి పరీక్ష

1. 836 (316) 112, 213 ( ) 420 - తగిన సంఖ్యతో ఖాళీని పూరించండి. 2. 'భా....', '.. పతి' ....సరస్వతి, మన్మథుడు అని అర్థం వచ్చేట్టు ఈ రెండు మాటలనూ ఖాళీలలో ఒకే మాట ఉంచి పూరించాలి. 3. భూపతి, చంద్రుడు అని రెండు అర్థాలు వచ్చే ఒకే మాట చెప్పండి, 4. సుశిదాకా, సువ్యాడు, దుత్స్యావాయను, భూవతిభ, రారిము - గజిబిజి అయిన ఈ వ్యక్తులలో కవి కాని వ్యక్తిని గుర్తించండి. 5. నీళ్ళలో పడిన వ్యక్తి మొట్టమొదట చేసే పని ఏమిటి? 6. 'క' గుణింతంతో వచ్చే రెండక్షరాల మాటలు మూడు చెప్పండి. 7. వగరు, పులుపు, తీపి, కాఫీ, చేదు, టీ - ఈ వర్గంలో అతకని మాటను గుర్తించండి. 8. ఎన్ని 20 లు చేరితే ఇరవై వేలు అవుతుంది? 9. లీపు సంవత్సరం అని దేన్ని అంటారు? 10. క్షయమాసం అంటే ఏమిటి?

## నత్తి వారసత్వంగా సంక్రమిస్తుందా?



రాంచి (బీహారు) కి చెందిన ఏ.కె. రాయ్ వరుసగా అయిదు తరాలలో 12 గురు నత్తివారు కనిపించే ఒక వంశ వృక్షాన్ని సవిమర్శకంగా పరిశీలించి, 'నత్తి' కి వారసత్వం ఒక ప్రధాన కారణంగా కనిపిస్తుంది అని అన్నారు. 'నత్తి' విషయమై వారసత్వం, పరిసరాలు నిర్వర్తించే పాత్రల సాపేక్ష ప్రాధాన్యాన్ని (relative importance) గుర్తించడానికి ఆ పరిశీలనలో ఆయన ప్రయత్నించారు.

"వ్యాపారంపై ఆధారపడిన స్నేహం స్నేహంమీద ఆధారపడిన వ్యాపారం కంటె ఎంతో మంచిది." —రాక్ ఫెల్లర్

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/ అర్థాలను గుర్తించండి:

1. కవి: (ఏ) సూర్యుడు, (బి) కవిత్వం చెప్పేవాడు, (సి) కప్ప, (డి) శుక్రుడు.
2. పవి: (ఏ) పవిత్రం, (బి) చంద్రుడు, (సి) వజ్రాయుధం. (డి) ఉరుము.
3. రవి: (ఏ) రావిచెట్టు, (బి) సూర్యుడు, (సి) చంద్రుడు, (డి) వరుణుడు.
4. భువి: (ఏ) నరకం, (బి) నాగలోకం, (సి) భూమి, (డి) చెట్టు.
5. దివి: (ఏ) దేవత, (బి) స్వర్గం, (సి) ద్వీపం, (డి) దివ్వె.
6. చవి: (ఏ) శీతకాలం, (బి) చావు, (సి) వసారా, (డి) రుచి
7. సవి: (ఏ) సావిత్రి తండ్రి, (బి) సూర్యుడు, (సి) అని, (డి) మృత్యువు.
8. గవి: (ఏ) ఎద్దు, (బి) గుహ, (సి) ఆవు, (డి) తేనె.
9. భావి: (ఏ) నుయ్యి, (బి) గర్భం, (సి) చిలుక, (డి) భవిష్యత్తు.
10. మావి: (ఏ) జరాయువు, (బి) సువాసన, (సి) మకరందం, (డి) మామిడి.

## అదృష్ట పాఠకుడు

పోస్టుకార్డు సైజులో మీ ఫొటోతో సహా సంగ్రహంగా మీ 'పరిచయం' వ్రాసి పంపండి. చీట్లు తీసి నిర్ణయించే అదృష్ట పాఠకుని/పాఠకురాలి ఫొటో, పరిచయం 'విస్డమ్'లో ప్రచురిస్తాం. రు. 10 లు ఖరీదు చేసే ఒక పుస్తకం కూడా ఆ అదృష్ట పాఠకుడికి, లేదా పాఠకురాలికి పంపుతాం. ఫొటో వెనుక విధిగా అడ్రస్సు వ్రాయాలి. ఫొటోలు త్రిప్పి పంపబడవు.

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

### రెండోసారి ఎన్నికకు నిలబడని అధ్యక్షుడు



అమెరికా 11 వ అధ్యక్షుడు జేమ్స్ నాక్స్ పోక్ ఎన్నికల ప్రచారంలో తను చేసిన వాగ్దానాలన్నీ నెరవేర్చాడు. అయినా రెండోసారి మళ్ళీ ఎన్నికకు నిలవడానికి నిరాకరించిన మొట్టమొదటి అమెరికన్ అధ్యక్షుడు ఆయనే!

"అవసరం లేనివి కొంటే, అచిర కాలంలోనే అవసరం ఉన్నవి అమ్మి వేయవలసి వస్తుంది!" -ఫ్రాంక్లిన్

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి, రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు బహుమతి.

## మీ ప్రశ్నలు

వ్యక్తిగత మైనవి కాకుండా అందరికీ ఆసక్తి కలిగించే ప్రశ్నలు అడగండి.

ప్రముఖ సినీ నటి, కథా రచయిత్రి

శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ

జవాబు లిసారు.

విస్డమ్

పోటీల కూపను

మార్చి 1983

## మిక్కిలి పెద్ద ఆసుపత్రి

ప్రపంచం అంతటిలోనూ మిక్కిలి పెద్ద ఆసుపత్రి న్యూయార్కులో వెస్ట్ బ్రెంట్ వుడ్‌లో ఉన్న 'ది పిల్‌గ్రిమ్ స్టేట్ హాస్పిటల్' అనే 'పిచ్చాసుపత్రి'. దీనిలో ప్రస్తుతం 3,816 పడక లున్నాయి. ఒకప్పుడు 14,200 పడకల దాకా ఉండేవిట!

## మీరైతే...

'మీ ఆవిడ ఎన్నికలలో నుంచుని ఓడి పోతే?' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షిక సూచించండి.

"శాంతంగా మాట్లాడు; చేతిలో పెద్ద కర్ర పట్టుకొని వెళ్ళు: నువ్వు చాలా దూరం వెళ్ళగలవు!" —రూజ్‌వెల్ట్

# ప్రపంచ వార్తలు

## మొట్టమొదటి 'జనాభా విజ్ఞానం సర్వస్వం':

ప్రపంచంలో మొట్టమొదటి సారిగా జనాభాకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వం (encyclopaedia) ఇటీవల న్యూయార్క్‌లో ప్రకటించబడింది. ఆ విజ్ఞాన సర్వస్వం కథనం ప్రకారం చైనా 2,010 నాటికి తన '0' జనాభా పెరుగుదల లక్ష్యాన్ని సాధించే పక్షంలో జనాభా విషయంలో ఇంత వరకూ చైనాకు ఉన్న అగ్రస్థానం ఇండియాకు సంక్రమిస్తుంది; 2,000 సం.రం నాటికి వర్ధమాన దేశాలలో వయోవృద్ధులు (65 ఏళ్ళు పైబడిన వారు) 17.4 కోట్ల మంది ఉంటారు.

* * *

## 'సౌర' గ్రామం (Solar village):

ఇండోనీషియాలో పశ్చిమ జావాలోని 'పికానిన్'లో విద్యుచ్ఛక్తి అవసరాలకు పూర్తిగా సౌరశక్తి మీదే ఆధారపడే ఒక 'సౌర' గ్రామాన్ని నిర్మించారు. ఇదివరకే ఇండోనీషియాలోని అనేక పట్టణాలలోని ఆసుపత్రులలో నీరు మరగబెట్టడానికి సౌర విద్యుచ్ఛక్తి వినియోగించబడుతూంది.

* * *

## 'ఇంగ్లీష్ చానల్' ఈదిన బాలిక:

18 ఏళ్ళ వయస్సు గల జాక్వెలైన్ హంప్సన్ అనే బ్రిటిష్ బాలిక డోవర్‌లోని షేక్స్‌పియర్ బీచ్ నుంచి బయలుదేరి 15 గం.ల 30 ని.లలో ఇంగ్లీష్ ఛానల్ ఈది, 'కెలే' సమీపంలో ఫ్రెంచ్ తీరం చేరుకుంది. ఈ ఘనకార్యం సాధించిన స్త్రీ లందరిలో ఈమె చిన్నది. ●

---

## 'సిలీ' చుంచు వేటాడే తీరు



బ్రిటన్‌కి చెందిన 'సిలీ' దీవులలో సముద్రతీరంలోని గులక రాళ్ళలోనూ, పైన్ చెట్ల తోటలలోనూ, గడ్డి మైదానాలలోనూ ఎక్కువగా కనిపించే ఒక జాతి చుంచెలుక (shrew) మాంసాహారి. కీటకాలు దీని ఆహారం. రాత్రిపూట గుంపులు గుంపులుగా వేటకు బయలుదేరే ఈ ఎలుకలు భద్రత కోసం పళ్ళతో ముందు పోయే ఎలుకను పట్టుకొని వెళుతూ ఉంటాయి.

"పశుత్వం + మానవత్వం + దైవత్వం = మానవుడు." —స్వామి వివేకానంద

# పోటీలు (ఫలితాలు)

(జనవరి 1983)

వ్యాసం: మొదటి బహుమతి: ఎస్. కృష్ణమాచార్యులు, దోన్: రెండవ బహుమతి: కుమారి పింగళి రాజలక్ష్మి, దువ్వాడ (విశాఖ జిల్లా): మూడవ బహుమతి: జి. కె. అనంత సురేష్, నాగార్జున సాగర్.

క్విజ్: జవాబులు: 1. డా. సర్వేపల్లి రాధాకృష్ణన్, 2. క్రూడ్ ఆయిల్, 3. సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939), 4. మీరట్, 5. జలహళ్ళి, బెంగళూరు, 6. శుక్రుడు (Venus), 7. మహమ్మద్ రఫీ 8. 22, 9. నక్షత్రం, 10. 'టైపిస్ట్' వ్యక్తి, 'టైప్‌రైటర్' యంత్రం.

విజేతలు: మొదటి బహుమతి: ఎస్. సత్యశేఖర్, సత్తెనపల్లి; రెండవ బహుమతి: బి. రాధాకృష్ణ, దొనకొండ; మూడవ బహుమతి: డి. చంద్రశేఖర్, బోర్లం (నిజామాబాద్ జిల్లా).

పజిల్: జవాబులు: అడ్డం: 1. గానము, 3. ధ్యానము, 5. రమణ, 6. ముగయుతక్క, 8. అమ్మగ, 9. వైష్ణవులు, 10. మిడుత, 12. కన్నియ, 14. పచారము, 16. గుచ్ఛము, 17. మదమకూల, 19. అహంత, 20. లుప్తము, 21. నగ్నము.

నిలువు: 1. గాయము, 2. రామకృష్ణ పరమహంస, 4. ముల(న)గకాయ, 5. రతమై, 7. గయుడు, 8. అలుక, 10. మిణుగురులు, 11. తపము, 13. న్నిలాటూ, 15. ముదత, 18. లగ్నము.

---

## విజయానికి అంగవైకల్యం అడ్డు రాదు



హెలెన్ కెలర్ (1880-1968) తన రెండో ఏటనే గ్రుడ్డిది, చెవిటిది అయింది. అయినా - స్వయంకృషివల్ల జనాదరణ గల మేటి ఉపన్యాసకురా లయింది. మొత్తం 10 పుస్తకాలు కూడా ఆమె వ్రాసింది.

"బానిసత్వం తప్పు కానప్పుడు ప్రపంచంలో ఇంక ఏదీ తప్పు కాదు!" —అబ్రహాం లింకన్

విజేతలు: మొదటి బహుమతి: కె. శ్రీనివాసరావు, విజయనగరం; రెండవ బహుమతి: అల్లి రామకృష్ణ, కలికిరి (చిత్తూరు జిల్లా); మూడవ బహుమతి: ఇ. సీతారామ శాస్త్రి, హిందూపూరు.

తెలివికి పరీక్ష: జవాబులు: 1. 1595 (పూర్వ సంఖ్యను తల్లక్రిందులు చేసి దానికి కూడగా తరువాతి సంఖ్య వస్తుంది), 2. తొమ్మిదవది, 3. ధనుస్సు, 4. సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు (కుజుడు), బుధుడు, బృహస్పతి (గురుడు), శుక్రుడు, శని, రాహువు, కేతువు, 5. ఆనంద, 6. ఆశ్వయుజ, కార్తీక మాసములు, 7. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వశిష్ఠుడు, జమదగ్ని, 8. నాలుగు: కృత, త్రేతా, ద్వాపర, కలి యుగములు, 9. 288, 10. గోవిందరావు.

విజేతలు: మొదటి బహుమతి: బి.వి. ఆర్ ఎస్.ఎస్ ఎస్. ప్రసాద్, విశాఖపట్నం; రెండవ బహుమతి కె. జ్యోతిర్మయి, తాడేపల్లి గూడెం; మూడవ బహుమతి: వెళ్ళపిళ్ళ శ్రీరామచంద్రమూర్తి, ఇంజరం (తూ.గో. జిల్లా).

మాటల మహిమ: జవాబులు 1. సేతువు (సి), 2. సముద్రం (డి), 3. తోలేవాడు (బి), 4. నిధి (బి), 5. ఆతిథ్యం ఇచ్చేవాడు (సి), 6. సమిధ (బి), 7. అమ్మల పొది (ఏ), సముద్రం (బి), 8. వేగులవాడు (సి), ప్రార్థన (డి), 9. చుట్టు కొలత (బి), కైవారము (డి), 10. దేవళము (బి), సమీపం (డి).

విజేతలు: మొదటి బహుమతి: బి.పి. కంకిపాటి, చీరాల; రెండవ బహుమతి: ఎస్. వి. సురేష్ బాబు, పామిడి (అనంతపురం జిల్లా); మూడవ బహుమతి: రంగుడు శివ రామ కృష్ణశర్మ, విశాఖపట్నం.

అదృష్ట పాఠకుడు: కటికాల కృష్ణమూర్తి, బి.ఏ., వెంకటగిరి టౌన్.

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహుమతి: జి. సాయిప్రసాద్ రావు, జనగాం (వరంగల్ జిల్లా); రెండవ బహుమతి: యు. హెచ్. ప్రసాద్, హైదరాబాద్; మూడవ బహుమతి: ఎ. ఎన్. యస్. శంకరరావు, విజయవాడ.

పాఠకుల అభిప్రాయాలు: రెండవ బహుమతి: ఎ. ఎన్. ఎస్. శంకరరావు, విజయవాడ; మూడవ బహుమతి: శ్రీకాకుళపు రామకృష్ణ, విజయవాడ - 5.

మీ ప్రశ్నలు: ఉత్తమ ప్రశ్న: జి. వెంకటరావు, బరగడ్ (ఒరిస్సా).

మీరైతే? : మొదటి బహుమతి: పి. జయప్రకాశ్, కామారెడ్డి, రెండవ బహుమతి: పి.ఆర్. కంకిపాటి, చీరాల; మూడవ బహుమతి: . యస్. వెంకటేశ్వర్లు, గుడ్లూరు (ప్రకాశం జిల్లా).

భావ పరిచయ పోటీ: మొదటి బహుమతి: పి.ఆర్. హరినాథ్, అనంతపురం; రెండవ బహుమతి: బి పి. ప్రమోద్ రాజ్, హైదరాబాద్; మూడవ బహుమతి: లంక ఫణీంధర్, తుంగభద్రా డామ్. ●

"అధముడు జీవించడానికీ, మధ్యముడు మృత్యువుకీ,
ఉత్తముడు అవమానానికీ భయపడతాడు!" —విదురుడు

